# లో వె లు గు

## (వీరేశలింగం స్మారకోపన్యాసములు)

---

ప్రథమ భాగము

---

రాజమహేంద్రి టవున్‌హాల్ ట్రిస్టుబోర్డు

# LO VELUGU

Veeresalingam Memorial Lecture

PART I

First Edition : 1986.
Copies : 1000

Price : Rs. 8-00
Library Edition . .J-00

*Published by :*
**Town Hall Trust Board,**
Rajamahendri - A. P.

*Printed by :*
**Maheswari Printing Press,**
Rajamahendri.

# న మ స్సు లు

'ఏదేశమేగినా ఎందుకాలిడినా' రాజమహేంద్రి పేరుపలికితే కందుకూరి వీరేశ లింగం పేరు జ్ఞప్తికిరావటం పట్టణ ప్రజల అదృష్టమనే చెప్పాలి. ఆమహనీయుడు రాజమహేంద్రి పట్టణానికి చేసినసేవలు లెక్కకుమించినవి. ఆయన సంఘసంస్కరణ, సాహితీసేవ భారతదేశపు ఎల్లలు చూచినవి. వీరేశలింగంగారు స్వంతధనంతో నిర్మించిన రాజమహేంద్రి పురమందిరము పట్టణకీర్తికి వైజయంతిక.

రాజమహేంద్రి పురమందిరము ఆయన ఆశయాల కనుగుణంగా సాంఘిక ప్రయోజనం కలిగేలా రూపుదిద్దాలనే ప్రయత్నం జయప్రదం కాగలదని చెప్పటానికి ఆనందిస్తున్నాము.

ప్రతి సంవత్సరం పుస్తకప్రదర్శన, సాహితీకార్యక్రమాలు నిర్వహించడానికి స్వర్గీయ వీరేశలింగం ఆశీస్సులే ఆలంబన

1891లో వీరేశలింగం గారు స్వంత ధనంతో రాష్ట్రంలో ప్రప్రథమంగా నిర్మించిన ఈ పురమందిరం శతవార్షికోత్సవాలు 1991వ సం॥లో పెద్దఎత్తున జరపడానికి సన్నాహాలు ప్రారంభమయ్యాయి. ఈబృహత్కార్యానికి రాజమహేంద్రి పౌరులసహాయ సహకారాలుండగలవని ఆశిస్తున్నాము.

సర్వస్వంత్యాగం చేసిన ఆయన జీవితం, ఆయనపడిన కష్టనష్టాలు, ఆయనసాహితీసేవలు, సహచరుల అనుబంధములు మొ॥ అంశాలన్నిటికి అద్దం పట్టాలనే ఆశయంతో 'వీరేశలింగంస్మారకోపన్యాసములు' ఏర్పాటుచేయటం జరిగింది. ఈస్మారకోపన్యాసములు ముద్రించి పాఠకులకిరకమలాలకు అందించే మా ప్రయత్నానికి ఆంధ్రప్రదేశ్ సాంస్కృతికశాఖ చేయూతనిచ్చింది. వారందించిన ధన సహకారముతో ఈ తొలి సంపుటి వెలువరించగలిగాం. ద్వితీయ సపుంటి త్వరలో మీకందించగలం.

వీరేశలింగం "లోవెలుగులు" చూపించిన ప్రముఖ రచయితలకు, ముందుమాట వ్రాసి యిచ్చిన ఆత్మీయులు, సమాచారమ్ దినపత్రిక సంపాదకులు శ్రీ గంధం సీతా రామాంజనేయులు గార్కి, పుస్తకప్రచురణ విషయంలో సహకరించిన డా॥ ఎ. నారాయణరావు, డా॥ నందులగోపాలకృష్ణ, డా॥ పి. వి. మురళీకృష్ణగార్లకు, సకాలంలో అచ్చువేసిన మహేశ్వర్ప్రెస్ వారికి కృతజ్ఞతలు.

31. 12. 86 భవదీయ,

రాజమహేంద్రి

యాతగిరి శ్రీరామనరసింహారావు.

పురమందిర ధర్మకర్తృత్వ సమితి కార్యదర్శి.

విషయ సూచిక

# సహృదయాభి నందనము

ఈ చిన్ని పుస్తకము అష్టదళపద్మము. అందు ప్రతిదళము సాహిత్య సంస్కార సురభిళము. గద్యతిక్కన బిరుదాంకితుడు కందుకూరి, పానుగంటి, చిలకమర్తి, గురజాడ మొదలగు ఆధునిక వైతాళికులకృషి ఆంధ్రసాహిత్యమున సంస్కార భానుడు అజ్ఞానాంధకారమును పటాపంచలు అయిన విధము ఈ పుస్తకమున సమీక్షింపబడినది.

మొదటి వ్యాసమున కళాప్రపూర్ణ శ్రీమధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు కందుకూరివారి ఆశయములను సఫలముచేసిన చిలకమర్తి గురువునకు తగిన శిష్యులని తమ చతురవచన రచన విన్యాసములో విశదమొనర్చిరి.

రెండవ వ్యాసమున శ్రీవరదా బ్రహ్మానందంగారు కందుకూరి, పానుగంటి ద్వయము సాహిత్యమును వజ్రాయుధముగా చేసికొని సంఘములోని కుళ్ళును, మూఢాచార పర్వతముల రెక్కలను తుత్తునియలుచేసిన విధము వివరించిరి.

మూడవ వ్యాసమున శ్రీసహదేవ సూర్యప్రకాశరావుగారు సాదాపాఠకునకు ఉపయుక్తమగునట్లు శ్రీ కందుకూరి నాటకముల పరిశీలనముచేసిరి. నాటకము వ్రాయుట ఒకఎత్తు, దానిని జయప్రదముగా ప్రదర్శించుట మరొకఎత్తు. ఈ రెండింటిని సవ్యసాచిగా నిర్వహించిన మేరునగధీరుడు శ్రీవీరేశలింగం ఔత్సాహిక నటులకు స్ఫూర్తి నిచ్చుచున్నాడనుట సముచితము.

నాల్గవ వ్యాసమున డా॥ అరిపిరాల నారాయణరావుగారు 'మహాపురుషుడు-మహాకవి' రచనలు తెలుగుసాహిత్యములో కనువిప్పు కలిగించిన విధమును సమీక్షించిరి. కందుకూరి ఆంధ్రసాహిత్య ప్రక్రియలకు ఆద్యుడయ్యాడు. ఆ రచనలకు మెరుగుదిద్దిన వాడు గురజాడ. కందుకూరి రచనలు తెలుగు సాహిత్యములో సంస్కారధోరణులు ప్రవేశపెడితే, విప్లవాత్మకమైనమార్పులు తీసికొనివచ్చిన ఖ్యాతి గురజాడ అప్పారావు

గారిదిఆను శ్రీశ్రీ అభిప్రాయము ఇందు విశ్లేషింపబడినది. తెలుగువాళ్ళు తలెత్తుకొని తిరుగుటకు కందుకూరి, గురజాడ రచనలను చదవాలి అనుటసమంజసము.

అయిదవ వ్యాసమున ఆంగ్లాంధ్రభాషలలో నిష్ణాతులు, సుప్రసిద్ధ విమర్శకులు అయిన శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు శ్రీ వీరేశలింగంగారి నవలలను సునిశితముగా విమర్శించుట ముదావహము. శ్రీకందుకూరిలో విమర్శనాత్మక వాస్తవికత critical Realism ను Ethical Realism ను ఎత్తిచూపారు. శ్రీకందుకూరి రచనాప్రభావము శ్రీవిశ్వనాథపైపడి కిన్నెరసానిపాటలు కరుణరసనిర్భరముగా పాడబడినవని చెప్పుట యుక్తము.

ఆరవవ్యాసమున శ్రీఆవంత్స సోమసుందర్ తమసహజమైన అభ్యుదయకవితావేశముతో శ్రీ వీరేశలింగంగారి ప్రహసనములలోని సామాజిక జీవన ప్రతిబింబమును వేడిగాను, వాడిగాను అనుశీలించిరి. నేటికీవిమర్శకులు శ్రీవీరేశలింగంపై బురదజల్లుటకు ప్రయత్నించుటచూచి తమ ఆవేదనమును ప్రకటించారు.

ఏడవ వ్యాసమున శ్రీమల్లంపల్లి శరభేశ్వరశర్మగారు 'శ్రీవీరేశలింగ సంస్మృతి' అనువ్యాసమున ఆధునికయువత కోతలుకోయుట మానివేసి, దేశానికి భాషకు గట్టిమేలు తలపెట్టుటకు శ్రీవీరేశలింగంగారి నుండి స్ఫూర్తి పొందాలి అనుట ఔచిత్యసంశోభితము.

ఎనిమిదవ వ్యాసమున డా॥ అక్కిరాజు రమాపతిరావుగారు శ్రీవీరేశలింగ సాహిత్యముపై సిద్ధాంతగ్రంథము సమర్పించి, యుగకర్త శ్రీవీరేశలింగం పంతులు అని సోపపత్తికముగా నిరూపించుట బహుజనాంగీకృతము.

ఆఱవ రాజమహేంద్రి పుస్తక ప్రదర్శన సందర్భములో పురమందిర ధర్మకర్తృత్వ సమితి యీ పుస్తకమును వెలువరించుట ముదావహము.

గంధం సీతారామాంజనేయులు
సమాచారమ్ సంపాదకులు.

రాజమహేంద్రి
31-12-86

# కందుకూరి - చిలకమర్తి

కళాప్రపూర్ణ
మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

ఆధునికాంధ్ర వాఙ్మయారాధకులకు వీరేశలింగముగారి సారస్వత సృష్టి అష్ట మూర్త్యాత్మకమైనది. ఆయన జన్మించిన నాటి కాల ప్రాంతము చాల విలక్షణమైనది. ఒక్కొక్క నేల ఒకరకపు ప్రతిభావంతులకు ప్రభవస్థానము. ఒక మాగాణిలో ఒక సస్యము బాగుగా ఫలించును. ఒక విత్తనమునకు ఒక పొలమునకు చుట్టఱిక ముండును. ఒక శతాబ్దిలో పుట్టినవారి బుద్ధిజాతి సాధారణముగా ఒకే విధముగా ఉండు నేమో !

కందుకూరి వీరేశలింగముగారు పుట్టిన 1848 వ సంవత్సరము పందొమ్మిదవ శతాబ్ది నడిబొడ్డు. అంతకు పూర్వపూర్వ శతాబ్దులలోని నన్నయ తిక్కనలు, శ్రీనాథుడు, పోతన, పెద్దన, రాయలు మున్నగు మహాకవులతో భావుకులకు ప్రాణబంధుత్వము ఉండనేయున్నది. అది యటులుండగా, పందొమ్మిదవ శతాబ్ది మలిరెక్క ఇరువదవ శతాబ్ది తొలిరెక్క ఆధారముగా ఆంధ్ర సాహిత్య విహంగము భావాంబర వీథిలో విశ్రుత విహారము చేసినది. ఆకాలమున జన్మించిన వేత్తలు పన్నెండుగు రున్నారన్నచో, వారిలో పదుమంది ప్రతిభా వైలక్షణ్యము కలవారు, క్రొత్త వ్యాఖ్యానములు చేసినవారు. దార్శనికము తార్కికమునైన పలుకుబడి గడించినవారు, పాశ్చాత్య సారస్వతముపై చూపు సారించినవారు, వంగాది వాఙ్మయములతో అనుబంధము పెట్టుకొన్నవారు. ప్రజలు, దేశము, సంస్కారము, మార్పు - ఈ విధమైన కొన్ని శబ్దాలకు అర్థమును రమణీయముగా ఘోషించినవారు. కందుకూరివారు, తిరుపతి వేంకటకవులు, వేదమువారు, పానుగంటివారు, గురుజాడ అప్పారావుగారు, గిడుగు రామమూర్తి పంతులుగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు, చిలకమర్తివారు, రామలింగా రెడ్డిగారు... వీరందరు దగ్గఱ దగ్గఱగా ఒక పంక్తి,

ఈ బృందములో కందుకూరి వీరేశలింగముగారు, ఒకానొక ఆధునిక సారస్వత

మును సృష్టించి దానితో తాననుప్రవిష్టుడై కొనియాడబడుచున్న కవీశ్వరుడు. ఈయన అష్టతనువులు ప్రత్యక్షములైనవి ఎవ్వి? పంచభూతములు, సూర్యచంద్రులు యజమానుడైన తాను-ఈయెనిమిది ఆ యీశునకు ఎట్లో, ఈ వీరేశునకు ఇవి అష్ట తనువులు. నవల - నాటకము - వ్యాసము - కవిచరిత్రలు - ప్రహసనము - గ్రంథ విమర్శనము - పత్రిక - వచనము - మఱి - యివి కాకతెలుగులో కథారచన - ప్రసిద్ధ స్త్రీపురుష జీవితములు - చారిత్రక గ్రంథములు - అచ్చతెనుగు కృతులు ఇత్యాద్యవాంతరశాఖలు కొన్నియున్నవి. పయినున్న అష్టవిధశాఖలలో ఈ యన్నింటి కంతర్భావము.

వీరేశలింగముగారు తెనుగులో కొన్ని ప్రక్రియలు సృష్టిచేసెను. కొన్ని ప్రక్రియలు పుష్టిపఱచెను. కొన్నింటికి విఘ్నేశ్వర పూజ నెఱపెను. కొన్నింటికి నాంది పలికెను. ఆయన సారస్వతోపాసన మార్గము సువిశాల సుందరమైనది.

ఆంధ్ర సారస్వత రసాల తరువాటి కొమ్మలతో రెమ్మలతో చివుళ్ళతో పూలతో పండ్లతో కనుపండువుగా ఉండుటకు ఉత్కటమైన కాంక్షపడిన తోటమాలి ఆయన. ఏ కొమ్మ అంటు కట్టవలెనో, ఏ పుచ్చు కొమ్మలెక్కడ నున్నవి కొట్టివేయవలెనో, ఎప్పుడెట్టి దోహదక్రియ జరుపవలెనో పూత మాడుచూపకుండ ఏమిచేయవలెనో మొదలైన వన పాలక తంత్రములందు అందెవేసిన చెయ్యి. కట్టు పెత్తనము చేయుట కాక స్వయముగా ఒళ్లువంచి పనిచేసిన సారస్వతా రామపాలకుడు వీరేశలింగముగారు.

గత శతాబ్ది సంభవులైన కవులలో వీరేశలింగముగారి ప్రత్యేకత యొకటి మనము భావించవలసి యున్నది. ఆనాటి చెళ్లపిళ్ల కవి శతావధానిగా యశస్సు నార్జించెను. వేదము వేంకటరాయశాస్త్రిగారు వ్యాఖ్యాన మల్లినాథులు. గిడుగు వారు వ్యావహారిక భాషావాద ప్రతిష్ఠాపకులు. పానుగంటి హాస్యరస పరివేష్టి. ఇటులు ఆ కాలము వారొక్కొక్కదానికి ఏకాగ్రమతులై త్యాగము చేసినవారు. వీరేశలింగము పంతులుగారి త్యాగము వాఙ్మయమున ఏకదేశ గతమైనదికాదు. శాఖోపశాఖా ధూర్వహముగా సర్వాంగ మహావృక్షముయొక్క పెంపు ఆయన అభిలషించినారు.

ఎవడు క్రొత్తమార్గమును వేసి చూపునో, ఎవని ననుసరించి దేశమున పలుమంది సంచరింతురో, ఎవని కెక్కువ విక్రమగౌరవము ఒరుగునో అట్టి వానికి యుగపురుష ఖ్యాతి సాధారణమై యున్నది.

వాఙ్మయ తరంగిణిలో ఒక ఘట్టమున మోకాలి బంటిగా, ఒక ఘట్టమున మొలబంటిగా, ఒక చోట తలమున్కలుగా అవగాహించి, ఆంధ్రలోకమును తన రచనంచే అమృతాభిషిక్తము చేసిన నిష్ణాతుడు పంతులు గారు.

ఆయన ఖ్యాతికి మూలస్తంభాయమానమైనది తెలుగు వచన రచనము.

నేంటు చదువు అయిన తరువాత 'బాలరామాయణము' తో తెలుగు బిడ్డలకు విద్యారంభము జరిగెడిది. అమరకోశము సంత చెప్పెడివారు. తెనుగులో సుమతి శతకము, కృష్ణశతకము, భాస్కరశతకము, భాగవతము లో రుక్మిణీ కల్యాణము, ప్రహ్లాద చరిత్ర మున్నగు ఘట్టములలోని పద్యములు పిల్లలకు చెప్పెడి యలవాటు. ఆంధ్రనామ సంగ్రహము ఆంధ్రనామశేషము వల్లింప జేసెడివారు. ఎందుకు చెప్పితి ననగా, శైశవము నుండియు విద్యాభ్యాసము పద్యములలోనే జరుగుచున్నది. వీరేశలింగముగారి బాల్యమునాటి చదువుకూడ అట్లే సాగినది. వర్తమాన విద్యాభ్యాసములో గద్య గ్రంథ పఠనమే ప్రధానస్థానములో నున్నది. పెక్కు మంది వాఙ్మయములో ఈ యుగము గద్యయుగమని ముక్తకంఠముగా చెప్పుచున్నారు. ఈ యుగమునకు ప్రవర్తకుడైన మహానుభావుడు చిన్నయసూరి. ఆయన పందొమ్మిదవ శతాబ్ది యారంభమున జన్మించినవాడు. గొప్ప లాక్షణికుడు, విద్వాంసుడు; తత్ప్రణీతమైన నీతిచంద్రిక గద్య గ్రంథములకు ఒక విధముగా ఆద్యమని కొందరు అందురు. తొల్లిటి పద్య గ్రంథములలో మధ్య మధ్య ఉన్న గద్యములకు దీటుగా నుండెడి శైలి చిన్నయ సూరిది. నన్నయ పద్య గద్యములు రెంటికి తుల్య ప్రతిపత్తినిచ్చిన వాడు భారతము చంపూరీతిగానే రచింపబడుట చూడగా, కవిత్రయము గద్యము నెంత గౌరవించినారో తెలియగలదు. తిక్కనసోమయాజి "పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్" అని చెప్పెను. పద్యమున గద్యఫక్కిని తిక్కన ప్రవేశ పెట్టెను. నన్నయ గద్యమున పద్యమాధురిని నిక్షేపించెను,

ప్రకృతము వీరేశలింగము పంతులుగారు 'గద్య తిక్కన' అను బిరుదమును పొందియుండుటలోని రహస్య మేమయి యుండును ? చిన్నయసూరి తరువాత తెనుగులో వచనశైలిని పరిక్షుణ్ణము చేసిన వీరేశలింగము గారికి రెండు శతాబ్దుల పూర్వము తంజావూరు మధుర రాజ్యములలో రఘునాథరాయలు, చొక్కనాథుడు ఏలికలై యున్నకాలమున యక్షగానములేకాక వచనగ్రంథములు ఇరువది ముప్పది వఱకు వెలువడినవి. వీరేశలింగముగారు తెనుగు సారస్వత వ్యాప్తికి చక్కగా నాలో

చెంచి గద్యమును సుబోధముచేసి బహు ప్రక్రియలు వెలయింపజేయుటకు నిశ్చయించు కొనిరి. సంధులు అచట నచట సడలించి భాషాలక్షణములు చెఱుపకుండ భావమును సామాన్య పాఠకునకు అందునట్లు యత్నించిరి.'వివేకవర్ధని' పత్రికలో తదాశయములు వెల్లడించిరి. కఠినసంధులు లోనుగా గలవి విడిచి సులభశైలిని నందఱకును తెలియు నట్లు వ్రాయుచు నొకప్పు డన్యదేశీయములను లోనుగాగలవానినిపూని కూర్తు'' అన్నారు. స్వీయ చరిత్రలో ''ఈ పత్రికా ప్రకటనమునందు నా యుద్దేశములు భాషాభివృద్ధియు దేశాభివృద్ధియు రెండు. నేనేర్పఱచుకొన్న భాషాపృద్ధి మార్గము తెనుగుభాషలో మృదువైన సులభశైలి సలక్షణమైన వచన రచన చేయుట'' అని చెప్పినారు.

పంతులుగారి రాజశేఖరచరిత్రము సత్యరాజా పూర్వదేశయాత్రలు ఆంగ్లేయ రచనలకు ఛాయ లైనను, స్వతంత్ర రచనల వలెనే యుండి నవలలకు దారిచూపినవి. ప్రహసనములు, స్వీయచరిత్రము, తర్కాదిశాస్త్ర గ్రంథానువాదములు, కవిచరిత్రలు ఈ ప్రక్రియ లన్నియు వచనమునకే ఉపస్కారకము లైనవి.

కందుకూరి వారి ప్రసంగము తెచ్చి కాని, చిలకమర్తి వారి వర్ధంతి సభను మనము జరుపు కొనుట శక్యము కాదు. వారిద్దరి యనుబంధ మట్టిది. పెక్కు భావములు వారిని ఓతప్రోతములవలె అల్లుకొని యున్నవి. వారిద్దరు ప్రతిభాసృష్టిని మించిన ప్రబోధదృష్టిగల కవులు. చిలకమర్తివంటి మేధావి కందుకూరి వారికి అనుయాయియగుట అందమైన కలయిక. ఆ తొలినాళ్లలో తెలుగు వచనమునకు వీరు గొప్ప విలువనిచ్చి బహు రచనలు వెలువరించిరి.

చిలకమర్తి వారి కర్పూర మంజరి, గణపతి, రామచంద్రవిజయము హాస్యరసోన్మిశ్రమములైన నవలలు. 'గణపతి' లోని సుకుమార హాస్యమిటు లుండును.

''గర్భాష్టమునందు ఉపనయనము చేయవలయునని ధర్మశాస్త్రముసం దుండుటచే ఆమె కుమారునకేడవయేట నుపనయనము చేయదలచెనని చదువరులు యూహింపవచ్చును. ఆ యూహ సరికాదు. గర్భాష్టమ మేమో ధర్మశాస్త్రమే మో పిచ్చమ్మకు తెలియదు. ఉపనయన సంకల్పమున కొక్కటే కారణము. పేదతనమే ప్రధానము. అన్న వస్త్రములకు వారికి మిక్కుటమైన యిబ్బంది కలిగెను. గంగాధరుడు వయస్సున పిల్లవాడే కాని భోజన విషయమున పెద్దవాడని చెప్పవచ్చును. ముమ్మారు మూడు షోలలు బియ్యము అతని కొకవిధముగ సరిపోవు చుండెను.''

నవలలో నటుండగా, కందుకూరివారివి చిలకమర్తివారి ప్రహసనములు హాస్య రసపుగనులు. చిలకమర్తి యెనుబదిమూడు ప్రహసనములు వ్రాసి వెలువరించెను. ఈ యిద్దరి హాస్యమునకు భేదము కలదు. పెద్దలన్నారు. "వీరేశలింగముగారి హాస్యము చిక్కనిది. లక్ష్మీనరసింహముగారి హాస్యము పలుచనిది. చిలకమర్తివారి హాస్యము గిలిగింతలు పెట్టి నవ్వించును. కందుకూరివారి హాస్యము గిల్లి బాధించును."

కందుకూరివారు, చిలకమర్తివారు సహజకవులనుటకువారి నామధేయాలు ఇంటి పేళ్ళతోసహా గీతపద్య పాదములలో ఇముడుట యొకటే నిరాక్షేపమైన సాక్ష్యము.

కందుకూరి వీరేశలింగకవి యితఁడు

చిలకమర్తి లక్ష్మీనరసింహ మితఁడు.

'యతి' కూడ సరిపోవుట దైవికము. వీరిద్దరకు గురుశిష్య సంబంధము ప్రసిద్ధమైనది. పాఠశాలలలో కళాశాలలలో మహామహులు ఉద్యోగములు చేయుచుందురు. చిత్రమేమనగా, వారి పాఠప్రవచనములు నిర్ణీత పాఠ్యమునకుగాని నిర్ణీత కాలమునకుగాని పరిమితములై యుండవు. బుద్ధిమంతులైన కొందఱు శిష్యులకు మాత్రమే అట్టి మహనీయుల పాఠప్రవచనముపై గౌరవభావముండును. చిలకమర్తి వారు కందుకూరివారి పాఠములను గూర్చి అన్నమాటలు:

"విశేషకాలము వారియొద్ద సంఘసంస్కరణము మొదలైన విషయములే వచ్చుచుండును. దీనిని బట్టి పాఠములు చెప్పుచుండుట లేదని అభిప్రాయ పడకూడదు. ఆయన పాఠములు సరిగా చెప్పు చుండెడివారు."

సంఘసంస్కరణోద్యమమున వీరేశలింగముగారికి చిలకమర్తి తోడ్పాటు ఎంతగానో ఉండెడిది.

లక్ష్మీనరసింహముగారికి నాటకముల యెడల అపారమైన ప్రీతి. 1888 లో ఏలూరుకంపెనీ ధార్వాడ నాటకసమాజము రాజమహేంద్రములో నాటక ప్రదర్శనములు ఇచ్చెడివారు. ఆ రోజులలో "కీచకవధ" నాటకముగా చిలకమర్తివారు వ్రాయుట జరిగినది. ఇది వారి తొలినాటకము. ఇందులో ద్రౌపదీపాత్ర వహించినవారు ఎవరో తెలియునా? టంగుటూరి ప్రకాశముగారు. ఆయన పాత్ర నిర్వహణము చిలకమర్తి వారి ప్రశంసకు పాత్రమైనది. చిలకమర్తివారి 'గయోపాఖ్యానము' లోక ప్రఖ్యాతము. లక్ష ప్రతులకు పైబడి సెనగపప్పువలె మనదేశమున అమ్ముడుపడిన నాటకమది.

చిలకమర్తివారు రచనలతో ఎంత ఖ్యాతి సంపాదించెనో, నిషధయోగ్యమైన శీలముతో అంత గౌరవమును ఆర్జించుకొనెను. పోలవరము జమీనుదారుగారి శీలములో కొన్ని ఆక్షేపణీయాంశములు ఎత్తిచూపి మొగమోటమి లేకుండ ఆయన కవి చెప్పి, క్రమముగా ఆయన స్నేహమునుండి తొలగిరని చెప్పుదురు. జాతీయాభిమానము, దైవభక్తియు చిలకమర్తివారిలో సమాన ప్రతిపత్తి కలిగియున్నవి. ఆ రోజులలో లాలాలజపతిరాయ్‌గారిని నిర్హేతుకముగా జెయిలులో పెట్టినపుడు వీరు వ్రాసిన యీ పద్యము వినవచ్చును.

మ॥ చెరసాలల్ పృథుచంద్రశాలలె యగున్, జేదోయి గేలించు న
య్యరదండల్ విరిదండ లయ్యెడును, హేయంబైన చోడంబులే
పరమాన్నం బగు, మోటికంబళులు తాల్పన్ బట్టు సెల్లాలగున్
స్థిరుఁడై యే నరుఁ డాత్మదేశమును భక్తిం గొల్చునవ్వానికిన్.

1907 లో 'విపిన చంద్రపాలు' వంగదేశమునుండి రాజమహేంద్రవరమునకు వచ్చి గోదావరీ మండల మహాసభలో ఉపన్యసించిన సందర్భమున నాటి సభాధ్యక్షులు చిలకమర్తివారు ఆశువుగ ఆ సభలో చదివిన గీతము' దేశమున మారు మ్రోగినది.

"భరతఖండము చక్కని పాడియావు
హిందువులు లేఁగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పిదుకుచున్నారు మూతులు బిగియగట్టి"

చిలకమర్తివారి దైవభక్తికి నిదర్శనమైన కృపాంభోనిధి శతకమునుండి ఒక పద్యము వినిపింతును.

శా॥ తోలుంగన్నులు చూడలేవుగద విద్యుత్కోటి భాస్వత్ప్రభా
జాలాతీత జగత్ప్రపూర్ణ ఘనతేజోరాశి నీమూర్తినిన్
నాలోఁగన్నయినం గనుగొను నటన్నన్ జ్ఞాననేత్రంబులే
నేలే; దేగతి నిన్నుఁజూడ నగు, దండ్రీ ! సత్కృపాంభోనిధీ !

చిలకమర్తి వారిని 1941లో కాకినాడ లోని పిఠాపురము రాజా వారి కళాశాల ఆంధ్రాభ్యుదయోత్సవ సభలు నిర్వహించిన సందర్భమున దర్శించుభాగ్యము కలిగినది.

ఆ సభకు ఆయన అధ్యక్షులు. తొలిసారిగా వేదిక మీద నేను ప్రసంగించినరోజు. ఇది అదృష్టముగా తలచు కొనుచు పులకించుచుందును.

1948లో కందుకూరి వీరేశలింగము పంతులుగారి శతజయంతి మహాసభలు వీరేశలింగోన్నత పాఠశాలాప్రాంగణములో జేజేయమానముగా నిర్వహింప బడినవి. ఆ సభలో "వీరేశలింగోదాహరణము" వ్రాసి చదివితిని. నా జీవితమున మఱచిపోని మహా సన్నివేశమది.

తెలుగు భాషకు కందుకూరి - చిలకమర్తి - ఈ జంట చేసిన పరిచర్య అమోఘమైనది. వీరిద్దరు ఒకేకాలమున ప్రకాశమానులగు సూర్యచంద్రులు. ఈ గురుశిష్యుల పోలికలను గూర్చి యెంత చెప్పిన చెప్పవచ్చును.

ప్రకృతము - ఈ వర్ధంతి సభలో స్మారక ప్రసంగము చేయుటకై నన్ను ఆహ్వానించిన సహృదయులకు వందనములు చేయుచు సెలవు తీసికొనుచున్నాను.



# కందుకూరి - పానుగంటి

వరదా బ్రహ్మానందం
ఫ్రీడం ఫైటర్

శతాబ్దాల తరబడి ఆంధ్రదేశములో పేరుకుపోయిన సంఘ దురాచారాలనీ, మూఢాచారాలనీ, వ్యక్తులస్వార్థం, అవినీతిని, దుష్టనైశాలనీ హాస్యరసాన్ని అయుధంగా, కలాన్ని కత్తిగా ఉపయోగించి తమ సాహితీ విస్ఫులింగాలతో పాతవ్యవస్థకి అగ్ని సంస్కారముచేసి, సమాజ పునాదులను కదిలించి సాహితీరంగంలో, సమాజంలో శాశ్వత కీర్తిని సంతరించుగున్న కొద్దిమంది ముఖ్యులలో ఒకరు యుగపురుషుడు శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు మరొకరు శ్రీ లక్ష్మీనరసింహారావు. ఇద్దరూ సమకాలికులు. ఇద్దరూ దైవాన్ని నమ్మిన వారు. అయితే కందుకూరివారు ఏకేశ్వరో పాసకులైన బ్రహ్మసామాజికులు కాగా శ్రీ పానుగంటివారు భక్తియోగపరులైన సాకార అరాధనాపరులు. ఇద్దరూ గ్రాంధిక భాషావాదులే.

అయితే యిద్దరూ తమ సాహిత్యంలో, హాస్య రచనలతో సామాజిక రుగ్మతల సంహారానికి పూనుకొన్నారు. ఇద్దరూ ఒక సూత్రబద్ధమైన హేతువాదం, తర్కాలతో రచనలను సాగించి దురాచారాలు, దుష్టనైజాలు, మూఢత్వాలమీద దాడిచేసి ఆంధ్ర సాహితీరంగంలో ఆంధ్రజాతిలో చిరంజీవులుగా నిలిచినారు.

కందుకూరివారి కాలంలో మరో సమకాలికులు శ్రీ గురజాడ అప్పారావు మహాకవి వాడుక భాషలో రసవత్తరంగా కన్యాశుల్కం లాటి హాస్య రచన, తదితర రచనలతో సాంఘిక దురాచారాలూ మూఢవిశ్వాసాల మీద దాడి చేసి, చీల్చి చెండాడి ఆంధ్రజాతిలో చెరగని చోటు చేసుకున్నారు. యీ సందర్భముగా వీరిని స్మరించడం విధాయకం కూడా.

కందుకూరి వారు తమ ప్రహసనాలతో, పానుగంటి వారు తమ సాక్షి ఉపన్యాసాలతో ఆనాటి ప్రజలని, మేధావంతులను ఆలోచింపచేసి, ఆ పాఠకులను తమ

ఉద్యమాలకు అనుచరులుగా చేసుకో గలిగారు. సమాజంలో స్వార్థం, అవినీతి, మూఢత్వం, దురాచారాలూ ఉన్నంతమేర వారి రచనల సజీవత మనకి గోచరిస్తూనే వుంటుంది.

మొదటిగా యుగపురుషుడు కందుకూరి వీరేశలింగము పంతులు గారి ప్రహసనాలను గురించి ప్రస్తావిస్తాను. వారి ప్రహసనాలలో సాంఘిక దురాచారాలని, స్వార్థ పరుల కుటిలనీతిని, మౌఢ్యాన్నిత తూర్పారబట్టడంలో రాజశేఖర చరిత్ర అగ్రగామి. అందులో ప్రధానపాత్ర రాజశేఖరుడు పొగడ్తలకి ఉబ్బిపోతూ, అన్నిరకాల మూఢ విశ్వాసాలూ కలిగి, చివరకి బంగారుయోగం నేర్చుకుందామన్న దురాశలోనై దరిద్రుడై అష్టకష్టాలూపడి జ్ఞానోదయం పొందిన వ్యక్తి. ఆ పాత్రచుట్టూ అనేక పాత్రలు తిరుగుతాయి. ఆ యా సందర్భముగా ఆనాటి సామాజికాచారాలకి ప్రతిబింబాలైన పాత్రలను సందర్భోచితముగా నడుపుతారు.

రాజశేఖరుడి కూతురు రుక్మిణి మరి కొందరు స్త్రీలూ నదిలో స్నానం చేస్తున్న సందర్భంలో మూర్ఖ స్త్రీలు ఎలాటి సంభాషణ చేస్తారో, సిద్ధాంతి భార్య ముండమోసిన కూతురు విషయంలో జాతక ప్రభావాలమీద అజ్ఞానపు వాదనలు నవ్వు పుట్టిస్తాయి- పెద్దముత్తైదువ (సోమిదేవమ్మ) తన కూతురికి పెండ్లయి మూడేండ్లయినదని ఆమెకి మగడుపోయి ఆరునెలలైనదని, ఆ మగడు గ్రహమై పట్టుకుని కొన్నాళ్ళు కలలో కనబడి, తరువాత రాత్రిలు ఒంటరిగా వున్నపుడు కనబడుతున్నాడని చెపుతుంది. అపుడు రుక్మిణి సోమిదేవమ్మా! మీ వారు గ్రామంలో పెద్ద సిద్ధాంతిగదా తెలిసే కూడా చిన్నదానిని అంత అల్పాయుష్మంతున కెలా యిచ్చారని ప్రశ్నిస్తుంది. సోమిదేవమ్మ జాతకాన్ని వదిలిపెట్టి "ఎవరి అదృష్టమునకెవరు కర్తలు ? దానికి ముండమోయవలసిన వ్రాత యుండగా ఎవరు తప్పించగలరు? అన్న కర్మసిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తుంది." ఎవరైనా జాతకము చూచి చేయుదురుగాని పెండ్లికుమారునకు లేని ఆయువు తెచ్చి పోయగలరా ? అంటుంది రుక్మిణి. జాతకములో మీ అల్లునకు పూర్ణాయుస్సే యున్నదికాబోలు అంటుంది. అదే సందర్భములో పదహారు సంవత్సరాల శేషమ్మ అత్తగారు తనని పెట్టే ఆరడిని హృదయం కరిగేలా వర్ణిస్తుంది. ఇప్పటికే అత్తమామల ఆగడాలకి ఎందరో యువతులు బలవంతపు చావులు చస్తున్న దారుణ గాథలను చూస్తూనే వున్నాం.

మతానికి చెందిన మూర్ఖపు పట్టింపులను నంబి రాఘవాచార్యులు రాజశేఖరుడి

సంభాషణలో వివరిస్తారు. రాజశేఖరుడు రాఘవాచారిని "మొన్న దేవాలయంలో స్వాములలో స్వాములేమో పోట్లాడినారట" అని అడుగుతాడు దానికి రాఘవాచారి "ద్వారకా తిరుమలనుండి వచ్చిన స్వామి సాపాటు చేసి కూర్చుని యుండగా, పెంటపాడు నుండి వేంచేసినస్వామి పెరుమాళ్ల సేవచేసి వచ్చి కూర్చున్నారు. వారిద్దరిలో ఒకరు తెంగల వారు, ఒకరు వడహలేవారు:ను గనుక—నామము క్రింద పాదముండ వచ్చును—కూడదని మాట పట్టింపులు పట్టుకున్నారని అంటాడు. మతాలలో శాఖల చీలికలు, మూర్ఖతని కందుకూరివారు ఎంతో హాస్యంతొణికించేలా రాశారు. నామంక్రింద పాదం వుండాలా, వద్దాఅన్న అంశమీద తగవులు పడి కోర్టులకు వెళ్లిన సంగతి మనకు విశదమే.

బ్రాహ్మణులలో నియోగి-వైదీకి భేదపు రొచ్చు ఎంతోవుంది. రాజశేఖరుడు నియోగి, ఆయన య్యింటికి వైదీకి సోమయాజి వచ్చి "తాను స్వహస్తి పాకం చేసుకుంటానని, స్త్రీలు వండిన పాకాన్ని తిననని," అంటాడు. రాజశేఖరుడు తమ యింట్లో స్త్రీలే వండుతారని అది సందర్భ పడకపోతే వేరే ఎక్కడికైనా వెళ్లమంటాడు. సోమయాజి చివరకి అక్కడే భోజనానికి తయారై "స్త్రీ పాకమేగాక నియోగి పాకము నేనెట్లు పుచ్చుకొందును" అన్నవ్యక్తి తన భోజనవిషయం రహస్యంగా వుంచమంటాడు అపుడు రాజమండ్రి నుండి వచ్చిన నీళ్ళకావడి వెంకయ్య "కోమటి యింట జరిగిన సంతర్పణకి బొల్లి పేరయ్య చేసిన వంటకాన్ని తనూ, సోమయాజి ఏక పంక్తిని కూర్చుని భోజనంచేసిన విషయాన్ని బైటపెడతాడు. ఈనాటికి అలాటి ఛాందసులు, బ్రాహ్మణులలో ఒకశాఖకన్న మరోశాఖ గొప్పదన్న అహంకారాన్ని ప్రదర్శించే అజ్ఞాన దురహంకారులనూ చూస్తూనే వున్నాం

రాజశేఖరుడి కూతురు సీతని నిరక్షరకుక్షి అందవిహీనుడుఅయిన మంత్రిప్రగడ బాపిరాజు కొడుక్కి కట్టబెట్టడానికి—బాపిరాజు దగ్గర కతికిన సిద్ధాంతి సీతనిచ్చి పెళ్లి చేద్దామను కుంటున్న రాజశేఖరుడి మేనల్లుడిది, సీతది కృత్తికా నక్షత్రం అవటంవల్ల కన్యావరులకు నాశనం కలుగుతుందని బాపిరాజు కొడుకు జాతకం బాగుండదంటాడు. రాజశేఖరుడు తన అభిప్రాయాన్ని మార్చుకోడు. తిరిగి జాతకాన్ని చూడమంటాడు. సిద్ధాంతి చేసేదిలేక సీత జననం కృత్తికా నక్షత్రంలో ఏపాదమంటే రాజశేఖరుడు ద్వితీయపాదమంటాడు మేనల్లుడు శంకరయ్యది ప్రథమపాదం కాబట్టి శాస్త్రప్రకారం దోషం లేకపోగా శుభంగా వుందని వెంటనే ప్లేటు ఫిరాయిస్తాడు. ఈ విధంగా జాతకాల విషయంలో దైవజ్ఞులు ఎలాంటి నాటకాలాడతారో వివరిస్తాడు. ఈ జాడ్యం ఇంకా మనలని పీకుతునే వుంది.

మరో సందర్భములో సిద్ధాంతి భూతవైద్యులకి సాధ్యంకాని తన కూతురు భూతాన్ని బైరాగి మూడురోజుల్లో కుదిర్చాడంటారు. రాఘవాచారి బైరాగి రోజూ దమ్మిడీ మెత్తురాగి కరిగించి బంగారం చేస్తాడని చెపుతాడు. రాజశేఖరుడు బంగారు విద్యనేర్చుకోడానికి బైరాగిని తన యింటికి రప్పించి మోసపోయి తనకున్న మొత్తం బంగారాన్ని, వెండిని బంగారుమోగంలో పెడతాడు. బైరాగి వానిని దొంగిలించుకుని పారిపోతాడు. రాజశేఖరుడు దరిద్రుడవౌతాడు. ఈ సందర్భముగానే భూతవైద్యం కపట నాటకాలను ఎంతో హాస్యంగా చిత్రీకరిస్తారు. ఈ నాటికీ బంగారం చేసే దొంగ బైరాగులూ, భూతవైద్యం పేరుతో సంసారాలను కూలదోస్తున్న మాంత్రికులూ నిరాటంకముగా జీవయాత్రలు సాగించడం చూస్తూనే వున్నాం.

రాజశేఖరుడి యిట్లో సుబ్బమ్మ మరణించినపుడు భోగముదాని యింటి పీనుగుల విస్సన్న రాజశేఖరుడితో బేరమాడి పదహారు రూపాయలకు శవాన్ని మోయడానికి అంగీకరిస్తాడు. ఇప్పటికీ పవిత్రగోదావరీ తీరంలో శవవాహకుల బేరసారాలు సాగుతూండడం చూస్తున్నాంగదా ప్రత్యక్షంగా

రాజశేఖరుడి చరిత్రలో గ్రహణాలమీదమూఢవిశ్వాసాలను ఎంతోహాస్యరసంతో ఎత్తిచూపుతారు. ఇలా రాసుకుపోతే ప్రతి పేజీమీదా ఒకవ్యాసం వ్రాయవచ్చు.

వినోద తరంగిణిలో సోమయాజి చేత-వార్ధక్యంలో పెళ్లి చేసుకున్నవారి పాట్లను చెప్పించి, భార్య "పోయిన ఎవరూ పిల్లనివ్వరు. పిల్లనివ్వకపోతే పాలలో బడ్డ బల్లిలా పరితపించి-అని అనిపించి వార్ధక్యంలో కూడా కోరికలు చంపుకోలేని వారి నైజాన్ని తూర్పారబడతారు. అందులోనే మగడు రహస్యం చెప్పాలని పిలిచినపుడు "మీకునాతో ఏమిరహస్యము వచ్చినది? మొగుడు పోయిన ముండవలె మీరురాత్రింబవళ్లు పనిపాటలు లేక ఇల్లుపట్టుకుని వదలరు" అని అనిపిస్తాడు. ముసలి మొగుళ్లు పడుచు పెళ్లాల మీద అను మానంతో కొంప వదలక పోవడం మనకి తెలిసిందే.

మహావంచక ప్రహసనములో జియ్యరు సూరి సేవకుడు దామోదరుడు సూరి సేవకురాలితో — పొద్దున్నే లేవడం వల్ల ఎంతలాభముందో చూసావా? ఎవరైనా చూచిపోతారనే భయం లేకుండా మనం స్వేచ్ఛగా సరసాలాడు కుంటూ వున్నాము" అని చాటు సరసాల హాస్యాన్ని మన ముందుంచారు. అదే ప్రహసనంలో కంఠరవుడు జియ్యరు సూరి కూతురు రామామణిని పెళ్లాడకోరుతాడు. రామామణి కంఠరవుణ్ణి

ప్రేమిస్తుంది కంఠరవుడు తన ఆస్తిపాస్తుల విషయంలో జియ్యారు సూరి దగ్గర ఎన్నోకోతలు కోస్తాడు తాను మహా మండలేశ్వరుడినని చెప్పి, జియ్యారు సూరి ప్రశ్న లకి పై కొకటి చెప్పిస్వగతంలో తన నిజస్థితిని చెపుతాడు'' కంఠరవుడు! దైవాను గ్రహంవల్ల నాకు కావలసినంత ధనంవసతులూ వున్నాయి. నా యిష్టం వచ్చినపుడల్లా వెళ్లి వుండడానికి నాకు గొప్పరాజ భవనం వుంది. (తనలో) సెంట్రల్ జైలు తప్ప కుండా రాజభవనమే'' అంటాడు ఈ విధంగా నడుస్తుంది కథనం.

అదే విధంగా విచిత్ర వివాహ ప్రహసనం, పునర్మణ ప్రహసనం మొదలైన ప్రహసనాలలో వ్యక్తుల వంచన, మోసం, దగాలను సునిసిత విమర్శలతో యథోచిత మైన పాత్రలద్వారా బట్ట బయలు చేస్తారు. కందుకూరివారు సృష్టించిన పాత్రలైన వంచకులు, దగాకోర్లు, లుచ్ఛాలు, దొంగలు, మూఢ విశ్వాసాలు, మూఢాచారాలూ మనకి సజీవంగానే కనిపిస్తున్నాయి. అందుకే వీరేశలింగం పంతులుగారి రచనలు చదివితే ఆయా పెద్దలు, దుర్మార్గాలూ మనకి కనపడి నపుడు వారినెదిరించి ఖండించిన వీరేశలింగం పంతులుగారు సజీవంగా కనిపిస్తారు.

ఇక పానుగంటి వారి సాక్షినిగురించి ప్రస్తావిస్తాను. సాక్షిసంఘం సత్యపురంలో స్థాపించ బడింది. దానికి సాక్షి అధ్యక్షుడు. జంఘాలశాస్త్రి, వాణీదాసు, కాలా చారి సభ్యులు బొర్రయ్య సెట్టి కోశాధికారి, శ్రీపానుగంటి వారు తమసాక్షి వుపన్యాసాల ద్వారా సమాజంలోని కుళ్లుని, వ్యక్తులలో దుష్టత్వం మూఢవిశ్వాసాల మీదా పూర్తి హాస్యరసాన్ని "రేజర్" అంత పదునైన కత్తిలా ఉపయోగించారు. కందుకూరి పానుగంటి కూడబలుక్కున్నట్లు కొన్ని సమస్యల లోని మూఢ విశ్వాసాలని చీల్చి చండాడారు. ఇద్దరూ "భూతవైద్యం; సమాజంలో పెద్దలులా నటించే "జంటిల్‌మేన్" మీద, కాముక ప్రవృత్తులమీద దాడి చేసారు.

ఉదాహరణకి : భూతవైద్యంమీద శ్రీ పానుగంటి వీమంటాడో పరిశీలిద్దాం సభాశాలలో జనసంఘము కిటకిట లాడుచున్నది. జంఘాలశాస్త్రి ఇట్లుపన్యసించెను. "నాకు స్వానుభవమున్నది. నేనా విద్యలో గృషి చేసినవాడను. మీకందరకూ దయ్య ములను గూర్చి సందేహ జ్ఞానములేని నాకు నిశ్చయ జ్ఞానము. గురు శుశ్రూష యొనర్చి కాయ క్లేశపడి పిశాచ విద్యాపారంగడ నైతిని" అని చెప్పి తానాశ్రయించిన గురువు నాశ్రయించి శిష్యుడు గా చేరాడు. ఆమరునాడు ఇద్దరూ భూతవైద్యశాల తెరిచారు. "రెండుబుట్టలతో నూలు దారముల ముక్కు, మూడు పళ్లికలలో తాటాకు

ముక్కలు రెండుమూడిళ్లలో బూడిద, మూతలేని దేవదారు పెట్టెలో గొన్ని రాగిరేకులు రెండు కడముంతలలో పసుపు, వెదురుగొట్టములో స్పిరిటు మత్తుతయున్నవి. ఇవి మా శాలలోని యౌషధములు" అని చెప్పి, "మూలుదారములని, రాటాకులని మాలో మేమనుకొనిన యెడల రోగులకు మా చికిత్స యందు నాదరణముగ నుండునని యా యౌషధములకు మా గురువుగారే కొన్ని వింత పేరులను గల్పించెను. ఇవి కాక ప్రతి వైద్యశాలయందు గొన్నియాయుధములుండు నాచారమును బట్టి మా వైద్య శాలలోగూడ శరీరచ్ఛేదనమునకై కొన్ని యాయుధములనుంచితిమి. రెండు చీపురు కట్టలు, పేప బెత్తపుకట్ట, దూలగొండి యాకులతో గలిపిన విభూతి, రెండు జతల యినపగోళ్లు, గట్టి బిరడలు గల భూతకర్షణ కాచపాత్రములు నొక పట్టుకారు, మా శాలలో శల్యతంత్రి సామాగ్రియై యున్నవి. ఈ ఆయుధములకు గూడ వింతవింత పేరులు మా గురువుగారు కల్పించిరి. చీపురు కట్టకి కాంతాకరనాల మనియు, పేప బెత్తమునకు బాలబుద్ధ్యుద్దీపిని యనియు, దూలగొండి బూడెద క్షుద్రగనారసింహ మనియు, నినుప గోళ్ళకు గాళికాదంష్ట్రి లనియు, సీలాలకు క్షోణి కుక్షి నిక్షేపము లనియు, బట్టకారునకు వీరాంజనేయ మనియు విచిత్ర నామములను వస్తుగౌరవ పరిహారార్థముగను, భూత రోగులకు భయాభివర్ధనార్థముగను గల్పించెను అక్కడ గోడలకు బాల, బగళ–మహిషాసురమర్ధని. మళయాళ భగవతిల విగ్రహాలుంటాయి ముగ్గురు చిత్రా లుంటాయి.

అక్కడికి ఒక బాలికను తీసుగొస్తారుకూడా వచ్చిన వృద్ధురాలు ఆ పిల్లని మేనత్త కొడుక్కి ఇవ్వడానికి స్థిరపడగా ఆతడు మరణించగా మరొకడికి వివాహం చేస్తారు. మేనత్త కొడుకు దయ్యమై పట్టుగుని ఆ పిల్లని మగనివద్ద పండుకొన నియడని చెప్పెను. "గురువు బాలిక చేయిచూస్తుండగా క్రీగంట అమె గురువుకేసి క్రీగంటచూచి ఇగిలించెను"అంటాడు. మరొక ఆమె పదహారు సంవత్సరాలు పడుచును తీసుగొచ్చి, ఆమె సంరివిచే నింకా వ్యక్తురాలు కాలేదని, దాని భర్త రెండవ పెండ్లి వాడని వెనకటి కళత్రానికి పిల్లలు లేరని చెప్పగా గురు ఆ పిల్లని వడిలో కూర్చో బెట్టుకోగా జంఘాలునికి ఒడలు వచ్చినట్లవుతుంది. ఒక వీధిలో బాలింతరాలు చని పోయి దయ్యమైందని ప్రచారం కాగా గురువుగారి సెలవుతో జంఘాలశాస్త్రి అర్ధరాత్రి చీకటిలో ఆ చోటకి వెడతాడు. దయ్యం రివ్వుమనివచ్చి జంఘాలుని గుద్దుతుంది. దానిని గట్టిగా అదిమి పట్టి గురువువద్దకు తీసుగొస్తాడు. తీరా అది గబ్బిలం. ఆ రహస్యం గురువు ఎవరికీ చెప్పవదంటాడు. మరో కేసులో గురువుగారు శాస్త్రిని

భూతమావహించిన దానికి తీర్థం ఇచ్చిరమ్మని పంపుతాడు. తీరా శాస్త్రి ఆమె గది దగ్గరకి వెళ్ళి తలుపు కన్నంలోంచి చూస్తాడు "మరియొక భూత వైద్యుడెవడో" మంత్రిస్తున్నట్లు తోస్తుంది-అతడు "నా కన్నులు మిరుమిట్లు పడునట్లు బింకమైన ఒక ముద్దును, ఫర్లాంగున్నర పొడవుగల ముద్దును" భూతమావహించిన ఆమెకు పెట్టడం చూస్తాడు. గదిలో కనిపించిన సీసా యవనీమక్షినిక్షేపంకాదని, అత్తరు సీసా అని గుర్తిస్తాడు. మరునాటికి ఆమె ఎవరితోనో లేచిపోయిన వార్త తెలుస్తుంది. చివరికి జంఘాలుడు "మనుజుడన్ని జంతువులనూ జంపుచున్నాడు. వీటికంటె సర్వనాశకుడు ప్రపంచమున లేడు. దయ్యములే యుండిన యెడల సృష్టిక్రమానుసారముగ నవి మనుజులను బీకుకొని తినకతప్పదు. భూత వైద్యతంత్రము సర్వమిథ్య అని కొన్ని నిదర్శనములు మాత్రమే స్వానుభవమున చెప్పితిని"అని ముగిస్తాడు.

ఇక సంఘంలో పెద్దమనుషులను గూర్చి పానుగంటివారు ఎంత చక్కగా వర్ణించారో చూద్దాం. "జంటిలుమాన్" అన్న వ్యాసంలో 11 జంటిల్‌మాన్ ఎంత చవుకైపోయినాడు. జట్కా బండి యెక్కినవాడెల్ల జంటిలుమానే, నోట సిగలెట్టు బెట్టిన వాడెల్ల జంటిల్‌మనే, అమెరికా నుండి వచ్చిన వాడెల్ల జంటిల్‌మనే, అరకుక్క తాగినవాడెల్ల జంటిలుమనే ...బసువులు సంతలో బెద్దమనుష్యులు, భోగము వీధిలో పెద్దమనుష్యులు, కిల్లిపాకలో పెద్దమనుష్యులు, కన్నగాండ్రలో పెద్దమనుష్యులు, నెత్తికోతల వాండ్రలో పెద్దమనుష్యులు అని వర్ణిస్తాడు. ఈ వాపతు జనం ఈ నాడు ఆ నాటికంటె ఒకటికి పదింతలై అన్ని రంగాలలోను పదవులలోను, ఉద్యోగాలలో మూడు పువ్వులు ఆరుకాయలుగా "జంటిల్‌మన్ షిప్"తో జనాన్ని దోచుకు తినడం చూస్తూనే వున్నాం గదా.

ఈ నాడు సెక్సు సినిమాల ప్రభావం పసికందుల దగ్గరనుండి పండ్లూడినవారి దాకా ఎంత పడిందో, దాని ప్రభావం ఏమిటో సంఘంలో సినిమాలవల్ల ఎంత అరాచకం, దుర్మార్గాలు జరుగుతున్నాయో చూస్తున్నాం. అమెరికాలో ఈ నాడు తెరమీద సంభోగ క్రియల్ని చూపడం చట్టబద్ధమైన హక్కుగా వుంది. కాని ఆ నాడు ఇంత బాహుళ్యమైన సినిమాలు లేవు. కేవలం తోలుబొమ్మలను తెరమీద ఆడించి చూపేవారు. అందులో **జుట్టు**పోలిగాడు, కేతిగాడు, బంగారక్క హాస్యప్రదర్శనకి చర్మపాంచాలికలు. అందులో **జుట్టు**పోలిగావిని దిగంబరంగా చూపేవారు. ఆ ప్రదర్శనని శ్రీ పానుగంటివారు ఎంతో అసహ్యించుగుని, అలాటి ప్రదర్శనవల్ల పర

దేశీయుల దృష్టిలో మనమెంత చులకనౌతున్నామో చెప్పి, గంధారి గానిని దిగంబర రూపం తెర కెక్కినంతనే ప్రేక్షకులలో కలిగిన వికారాలని ఇలా వర్ణించాడు. ఇప్పటికి లక్ష్మణ మూర్ఛఘట్టం జరిగింది. 'ఒక త్రుటికాలమగు పిదప జను లగ్గిపుల్లలట్టె వెలిగించిరిః చుట్టలు ముట్టించిరి కొంకులుపోయిన వ్రేళ్ళను సరిచేసుకొనిరి. తిమ్మిరి ఎక్కిన వ్రేళ్ళను నేలనడచిరి మెడికలు విరుచుకొనిరి ఒడలు విరుచుకొనిరి...కొందరు లేచి చోటు భద్రముసుమా అని ప్రక్కవారలకు జెప్పి పైకి పోవుచుండిరి. కొందరు నెత్తిగుడ్డలు తీసి పృష్ఠముల క్రింద వైచుకొనుచుండిరి. "ఇంకనూ వచ్చినాడు కాడేమిరా"అని యొకరి నొకరు ప్రశ్నించుకొనుచుండిరి. ... కుఱ్ఱవానికిదే సమయము కొంచము నమలబెట్టుమమ్మా అని యత్త కోడలిన కాజ్ఞాపించుచున్నది. "అక్కా బట్ట తిన్నగ సద్దుకో"అని నిమ్మళముగ చెల్లిఅభిమాన సంరక్షణమును బోధించుచున్నది. "అబ్బీ" రవంత దూరముగ గూరుచుండరాదా ? ఆడకూతురుపైన గాలివేయుచున్నా"వని ఒక చింపిరితలది బండివానికి పరకాంతా పరాఙ్ముఖత్వమును ప్రతిపాదించుచున్నది. "అమ్మా ! బద్ధకముగ నుంటివేమైన ననుమానముగా నున్నదా"అని యొక వితంతువు సమాసన్న ప్రసవసమయమగు నొక పడతిని బరామర్శించుచున్నది. "ఓదీ నీ జిహ్వాదీయ"యని యొక గుడిసెవేటుది పూర్వజారుని జీకొట్టుచున్నది. "ఆయనకు దోలుబొమ్మలన్న ప్రాణమని" యొక వితంతువు భర్తృసంస్మరణ పరిపాకమున ప్రకాశించుచు లోక సంగ్రహార్థము కనులొత్తుకొనుచున్నది. "అమ్మా బొమ్మలలా గెందుకాడునే"అని యొక చిన్నబాలిక చర్మపాంచాలికా ఖేలన రహస్యమంత్రోపదేశ బోధనమున కై తల్లిని యాచించుచున్నది. "ఏమిటో మాయప్రపంచము. మనము మాత్రము తోలుబొమ్మలము కామా"యని యొక వృద్ధ వేశ్య వేదాంత బోధనమును బోసినోటితో సాయించుచుండెను.

గ్రంధారిగాడు తెరమీద కెక్కుతాడు. అప్పుడు ప్రేక్షకులలో బయలుదేరిన కలకలని పానుగంటి ఇలా వర్ణించారు. ఇన్ని పంగనామము లెందుకు ? ఇన్ని విభూతి రేఖ లెందుకు ? ... ఇన్ని పిడిసిగ లెందుకు ? ...కొందరు రెప్పవేయకుండ జూచుచున్నారు, కొందరు కనులు సన్నచేసి చూచుచున్నారు, కొందరు క్రీగంటి చూచుచున్నారు, కొందరు చేతిని గొట్టమువలెచేసి దానిలోనుండి చూచుచున్నారు, జూపానసివారు దగ్గరకుపోయి చూచుచున్నారు. కాని కాంతావలోకనములు మరింత వింతగ నున్నవి. నోరుతెరచి బాబాకరపు చూపులతో బాలవితంతువులు పరిశీలించుచున్నారు, ముగ్ధాంగనలు తలలట్టె వంచుకొని పైరెప్పలపైనుండి చూచుచున్నారు,

ప్రౌఢవనితలు ప్రక్కచూపుల జూచుచున్నారు. వృద్ధులు తేరబారి చూచుచున్నారు. నడిమి వయసువారు చూచిచూడనట్లు చూచుచున్నారు, కొందరు గాజుచూపులు జూచుచున్నారు, కొందరు వెర్రిచూపులు జూచుచున్నారు. "వీని మొగముమండ ! వీని జూచుటదేమిటి"యని తిట్టుచు గొందరు చూచుచున్నారు !... ఈ విధంగా వివిధరకాల హావభావాలతో గ్రంధారిగాని చూచుచున్నస్థితిలో ప్రేక్షకుల మనోభావాల కనుగుణ్యంగా వారి మాటలలో ఉటంకిస్తాను ... "అమ్మా నడిటిక్రింద సుఖపడు గీత లేకపోయిన తరువాత పైన బాషట పండురుతెంపుకమ్మా ! చేతజేసికొన్నిపూజ సన్నమైన తరువాత మెడలోనికి జేయించుగున్నకంటె రోకలియంత లావున్న నేమిఫలము"అని దీనవదనముతో ననెను. "జారిష్టదని పైకిబండారమే గాని లోపల లొటారము ఏమిచెప్పకోను నా పిండాకూడు" ఒక యాతరుప్పు తలచి "బ్రతుకునకు ఫలమిది"అంటుంది. ఒక యాడుదాని బిడ్డడు నిద్రనుండి యట్టెలేచి తెరపై బొమ్మని చూచి "అమ్మా ! నాన్న యడుగో"అని కేకలువేసెను. అంత తల్లి "నాన్న ! అడుగనక్కరలేదు, నాన్న బ్రతుకునకు నా బ్రతుకున కామాత్రమూ"అంటుంది.

అదే విధంగా పానుగంటివారి సాక్షిలో మరో వజ్రపుతునక "పశువులసంత" పశువులసంతలో రకరకాల ఎద్దులు, ఆవులు, దున్నపోతులు గేదెలు వుంటాయి. వాటి ఆకృతులను వర్ణించి ఇలా అంటారు. "ఇవి లక్షణముగనే యున్నవి. మనుష్యలోక విరుద్ధముగనే యున్నది. స్త్రీ పురుష బంధమే ప్రబలతమ బంధము, అదియే లోకమందలి కలహములకు, గష్టములకు, నతాయములకు, నప్రతిష్ఠలకు, నావహములకు, మోసములకు, బలాత్కార మరణములకు ముఖ్యకారణమైయున్నది ...ఇన్ని గిత్తల నడుమ, ఇన్ని పోతుల నడుమ, ఇన్ని యావులు, ఇన్ని గేదెలువి కదా : పోతున్న గేదెపైగన్నువేయుట కాని, గేదె కొంచెము సిగ్గుపడి ముసిముసి నవ్వులు నవ్వుకొనుట కాని, యెద్దు గోవెను కనుగీటుట కాని, గోపట్టె చనుకట్టు మాటుచేసికొని సంభ్రమించుట గాని ఏమైనయున్నదా ? అహా ! ఏమి నిష్కాపట్యము. ఏమి యమాయకత్వము ? - ఏమి వ్యామోహ సూన్యత ? నరులలోనె స్త్రీ పురుషు లిందరొక్కచో గలసినపుడు-కలగలసి మెలగుట కింతయవకాశమున్నపుడు-నవ్వులతో - బువ్వలతో - గను గీటులతో-గోటి పోటులతో - ముద్దులతో-సుద్దులతో-గిలిగిలింతలతో-సకిలింతలతో-ద్రాగుటతో-పైట లాగుటతో - నచ్చటి పంచ భూతములు 'హడ శృంగారరస మయమగునట్లు చేయరా ?" ఈ నాడు బస్సులలో-రైళ్ళలో-తీర్థాలలో కొందరు యువతీ యువకుల చర్యలు మనం చూస్తూనేయున్నాం,

"ఎన్నికలు" అన్న వ్యాసంలో ఆ నాటికేకాక ఈనాటికీ వాస్తవంగా కనబడే పరిస్థితులనెలా వర్ణించారో చూద్దాం "కొన్నిమాసముల నుండియే యిక్కడి జనులు తెరపిలేని కదలికను గలిగియున్నారు. చెంబులో గ్రొచ్చుకాయలవలె - గాలిలోని పరమాణువు వలె గలగుండు పడిన నీటిలోని చేపలవలె — ఆ వైపున కావైపున పైకి క్రిందికి నన్ని వంకలకు స్వప్రదక్షిణముగా పరప్రదక్షిణముగా, స్వపరిదక్షిణ పరపరిదక్షిణగా అనేక గమనములతో వేగములతో, దాటులతో, మహా అహంకారములతో, ఛీకర ఝుంకారములతో, ప్రబల హుంకారములతో దిరుగుచున్నారు. పరుగెత్తుచున్నారు. దుముకుచున్నారు. ఎగురుచున్నారు. ఎక్కడ చూచిన సందడి - సందడి — ఇగిలింపులు - సకిలింపులు - కోపము — తాపము - అరపులు - చరపులు — అదరింపులు - బెదరింపులు కరకు చూపులు - మొరకు త్రోపులు - **తిట్లు** - - రట్లు - ఛీఛీలు — ధూధూలు - ఎక్కడ వినినను జట్కాబండ్ల కిరకిరలు - మోటారుబండ్ల మొరమొరలు-సైకిలుబండ్ల దణదణలు ప్రబలాటకనధాటి మంతములగు శకటముల యన్యోన్య సంఘర్షణములు — ప్రాయికముగ బలాత్కార పరలోకాకర్షణములు" అంటూ అభ్యర్థులు పరస్పరం మోసంచేసుకోవడం, కులతత్వాల ప్రేరణ అన్నీ సాకల్యంగా వర్ణిస్తారు. సాక్షిలో ప్రతిమాటా, ప్రతివాక్యం పానుగంటివారి సాహితీ పటిమకు, సమాజం, మానవ నైజాల అవగాహనకి గీటు రాళ్ళు. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు. శ్రీ పానుగంటి లక్ష్మినరసింహారావు ఆంధ్రజాతి శాశ్వతంగా గర్వించదగిన మహా సాహితీవేత్తలు - సంస్కర్తలు - ఇక్కడకాక మరో రాష్ట్రంలో పుట్టివుంటే వారికి ప్రపంచఖ్యాతి లభించి వుండేది. ప్రతి ఆంధ్రుడు వారి గ్రంథాలను చదివి, తనని తను బాగుచేసుకుని జాతిని బాగుచేయడానికి కృషి చేయవలసిన అభ్యుదయ, ప్రగతి మార్గాలను వేసి కీర్తిశేషులైన మహాపురుషులు వారికి ఆంధ్రజాతి రుణ **పడివుంది**. వారికి నా సుమాంజలులు. నా జోహారులు.



# శ్రీ కందుకూరి నాటకాల పరిశీలనము

శ్రీ సహదేవ సూర్యప్రకాశరావు

శ్రీ వీరేశలింగ కవీంద్రులు భావుకులు; ధిషణారమణీయులు, గ్రంథకర్తలు, ప్రవక్తలు, యుగకర్తలు వారు తెలుగు పలుకుల వెలదిని కై సేసిన కొంగ్రొత్త తొడవులలో నాటకాలంకారం ఒక అపురూపమైన తొడవు. దాని వన్నె చిన్నెలనుగూర్చి పరిశీలిద్దాము.

మనకున్న కావ్య విభేదాల రెంటిలో నాటకం ఒకటి. దీన్నే దృశ్య కావ్యమంటారు. అంటే చూడదగినది. ఈ దృశ్య కావ్యాన్నే నాటకమని, రూపకమని ప్రేక్ష్యమని కూడా అంటారు. నటింపదగినది గనుక నాటకమనీ, సీతారామ పాత్రి సహజావస్థలు నటుల్లో ఆరోపింపబడడంచేత రూపకమనీ; చూడదగినది కావడంచేత ప్రేక్ష్యము అన్నారు.

శ్రీ వీరేశలింగంగారు అనేక విధ గ్రంథాలనేగాక 13 ప్రహసనాలను 20 నాటకాలను రచించారు. వీనిలో కొన్ని రచనలు అసమగ్రములు.

## శ్రీ వీరేశలింగం నాటక రచన ప్రారంభం :–

వీరి రచనావ్యాసంగం 1870 లోనే ప్రారంభమయింది. కాని నాటక రచనకు మాత్రం వారు 1875 లో శ్రీకారం చుట్టారు.

"ఒక ఇంగ్లీషు ప్రబంధమును దేనినైనను తెనిగించి, శైలి కుదురు పరచుకొని తరువాత స్వకపోల కల్పితమైన వచన ప్రబంధమును వ్రాయబూను కొనవలెనని తలచి గోల్డుస్మిత్తనెడి ఇంగ్లీషు కవి చేసిన "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్" అను కథను తెనిగింపనారంభించి రెండు, మూడు ప్రకరణములు చేసితిని. "**P. 158 2nd part** అని, కౌపర్" అనెడి ఇంగ్లీషు కవీశ్వరుడు రచించిన 'జాన్‌గిల్పిన్' అను పుస్తకములు

'అభాగ్యోపాఖ్యాన' మనెడి హాస్యప్రబంధముగా పద్యములతో జేసితిని. P· 168 2nd part· అని వ్రాసికొన్నారు కవిగారు తమ స్వీయచరిత్రలో. రచనరో చేయితిరగడానికి కథా కల్పనను గ్రహించ డానికి. పాత్రోస్మీల విషయాలను అవగాహన చేసికొనడానికి, సంభాషణ సరళిని ఆకళింపు చేసికొనడానికి, అంక విభజనను గుర్తించడానికి కవిగారు కూలంకష కృషి చేసినట్లు పలు పలుకుల వల్ల తెల్లమవుతున్నది.

కవిగారు 1875లో శాకుంతల నాటకాన్ని తెనిగింప పూనుకొన్నారు. రెండంకాల్ని తెనిగించి 1876లో 'వివేకవర్ధని' లో ప్రచురించారు. విశాఖపట్టణంలో పరవస్తు వెంకట రంగాచార్యులుగారు అభిజ్ఞాన శాకుంతలాన్ని తెనిగించి 'విద్యాభివర్ధని' పత్రికలో ప్రకటిస్తున్నారని తెలిసి యా పత్రికను తెప్పించుకొని చదివి వారి యాంధ్రీకరణం ముగిసిన తర్వాత తాము ఆంధ్రీకరించ వచ్చునే తలంపుతో కవిగారు తమ రచనను మానివేసారు. ఎంతకూ పరవస్తువారి ఆంధ్రీకరణం వెలువడక పోవడంచేత వీరు శాకుంతలాన్ని సమగ్రంగా తెనిగించి 1883 లో ముద్రించారు. 1880 లో శ్రీహర్ష రచితమయిన 'రత్నావళి' నాటికను, షేక్స్పియర్ రచించిన 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్' 'చమత్కార రత్నావళి' యను పేరును 'మర్చంట్ ఆఫ్ వెన్నిసు'ను వెన్నీసు వర్తక చరిత్ర అనుపేర (2 అంకములు మాత్రమే) తెనిగించారు.

1880 లోనే 'బ్రాహ్మవివాహము' "వ్యవహార ధర్మబోధిని" "వివేక దీపిక" మునిసిపల్ నాటకం అనే స్వకపోల కల్పిత నాటకాల్ని రచించారు. 1885లో కాళిదాస విరచితమైన మాళవి కాగ్ని మిత్రాన్ని, రిచర్డ్ బిన్స్లే షెరిడన్ అను ఆంగ్లకవి కల్పిత మైన డ్యుయన్నా అను నాటకాన్ని "రాగమంజరి" యను పేర అనువదించారు. ఆ సంవత్సరములోనే "దక్షిణ గోగ్రహణం" 'ప్రహ్లాద' నాటకాల్ని స్వతంత్రముగా రచించారు. శ్రీకృష్ణ మిశ్ర రచితమయిన ప్రబోధచంద్రోదయాన్ని అనువదింప ప్రారంభించారు. కాని 1881 లో కాని పూర్తిచేయలేదు. 1886 లో హరిశ్చంద్ర నాటకాన్ని స్వంతంగాంవ్రాసారు. 1889లో తిర్యగ్విద్వన్మహా సభను మహారణ్య పురాధిపత్యాన్ని "మూషకాసుర విజయాన్ని" స్వకపోల కల్పితంగా రచించారు. 1894 లో షెరిడన్ కవి కృతమైన "The Rivals" అనే నాటకాన్ని కల్యాణ కల్పవల్లి అనే పేరుతో రచనచేసారు. అదే వారి కడపటి నాటక రచన. ఈ విధంగా వారి నాటక రచన 1875 నుండి 1894 వరకు నిరాఘాటంగా సాగింది.

కవిగారు తమ స్వీయచరిత్ర లో వ్రాసికొన్నట్లుగా ఆంగ్ల గీర్వాణ నాటకాల్ని

తెలుగు సేయడంలో స్వతంత్ర నాటకం రచించడంలో తప్ప తక్కిన అన్ని రచనలకు కవిగారు ఆద్యులే.

## మొదటి తెలుగు నాటక ప్రయోక్త :

1880 సంవత్సరము నందు ధార్వాడ నాటక సమాజం వారు మన పట్టణము (రాజమండ్రి)వచ్చి గొప్ప పాకవేసి దానిలో తమ నాటకములనాడి పోయిన తరువాత, పాక తీసి వేయక మునుపే ఆ నాటకశాలలో నాటకము లాడింప వలెనని కుతూహల ములో శ్రీ హర్ష విరచితమైన 'రత్నావళి' నాటికను సంస్కృతము నుండి గద్య పద్య ములతోను, షేక్స్పియరు మహాకవి విరచితమైన 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్' నాటకమును గద్యాత్మకముగా తెనిగించి యా రెంటిని ఆ నాటకశాలలో జయప్రదముగా ప్రదర్శిం చితిమి" అని కవిగారు తమ స్వీయచరిత్రలో వ్రాసు కొన్నారు. ఆ ప్రదర్శనలే తెలుగు ప్రదర్శనలకు నాంది. ఆంధ్రదేశములో నాటక ప్రయోక్తలలో ప్రథమ గణ్యులైనారు. అదీ మన రాజమహేంద్రిలో — అది మనకు గర్వకారణము

సంస్కృత నాటకానువాదం :-

## శాకుంతలము :

మహాకవి కాళిదాసు విరచితమైన శాకుంతల నాటకాన్ని శ్రీ వీరేశలింగంగారు **1775** సం॥లో ఆంధ్రీకరింప పూనుకొని నెమ్మదిగా పూర్తిచేసి **1882** వ సం॥లో ముద్రించారు. వీరి ఆంధ్రీకృత శాకుంతలానికి నేటికి నూరేండ్లు పైబడినా అది నిత్య కళ్యాణం పచ్చతోరణంగా విలసిల్లుతూనే వుంది. దానికి దీటైన అనువాదం నేటి వరకు లేనేలేదు.

శాకుంతలంలోని చతుర్థాంకం ప్రఖ్యాతి గాంచినది గదా! కణ్వమహర్షి అత్త వారింటికి వెడుతున్న శకుంతలకు సుద్దులు చెప్పాడు. ఆమె బయలుదేరింది. చిన్న నాటినుండి పెంచిన లేడిపిల్ల శకుంతల చీరచెరగును నోటితోలాగి ఆమెగమనానికి విరోధం కలిగిస్తుంది. అంత ___

శకుం : ఎవరది నా చీర పట్టుకొని నిలుపుచున్నారు ?

కణ్వు : బిడ్డా! కలుకు కుశగ్రుచ్చుకొని నోరుగాయమయిన బూయుచును గార

సూనను బుండు మాన్పి ప్రేమచే జామలను మేపి, బిడ్డవలెను పెంచుటను దారిఁ బాయదీ పిల్ల లేడి.

శకుం : (లేడితో) బిడ్డా ! సహవాసులను పరిత్యజించి యేగెడు నన్నేల వెంబడించెదవు. పుట్టిన తోడనే తల్లిచే విడువబడియు పెరిగితివి. ఇప్పుడు నాచే విడువబడిన నిన్ను మానాయనగారే విచారింతురు. ఇక వెనుకకు మరలుము (అని ఏడ్చుచు నడచుచున్నది) ఇది ఎంతటి కరుణాత్మకమైన సన్నివేశము.

## రత్నావళి :

ఈ నాటికను శ్రీ కందుకూరి 1880 సం॥లో అనువదించారు. దీనిని కాశ్మీర దేశ ప్రభువయిన శ్రీహర్ష దేవుడు సంస్కృతంలో రచించాడు.

రత్నావళి నాటిక. ఇది ఉపరూపకాల్లో ఒకటి. ఇది సంకీర్ణ రూపకం. ఇందులో రూపక లక్షణాలు ప్రకరణ లక్షణాలు కూడ ఉంటవి. ఇందులో శృంగారం ప్రధానం. వృత్తి కైశికి వృత్తి. అంకాలు నాల్గు. దీనిలో నాయకుడు ఉదయనుడు. వత్సరాజని నామాంతరం. భాసమహాకవి స్వప్న వాసవదత్త అనే నాటకాన్ని ఈ గాథ ఆధారంగానే రచించాడు. భార్య వాసవదత్త. మంత్రి యౌగంధరాయణుడు. దీనిలో నాయిక రత్నావళి (సాగరిక) సింహళేశ్వర తనూజాత. సింహళేశ్వరుడయిన విక్రమ బాహు, ఉదయుని భార్య వాసవదత్త పినతండ్రి. రత్నావళిని వివాహమాడిన వాడు సార్వభౌముడవుతాడని ఒకసిద్ధునివల్ల మంత్రి యౌగంధ రాయణుడు తెలిసికొంటాడు. దానికై ప్రయత్నిస్తాడు. ఆ ఆకాంక్షే, ఆ ప్రయత్నమే ఈ నాటికకు బీజావాపం.

## మాళవికాగ్ని మిత్రము :

కాళిదాస మహాకవి దివ్యలేఖిని నుండి జాలువారిన ఒక పారిజాత ప్రసూనం. శ్రీ వీరేశలింగ కవీంద్రులు ఈ నాటకాన్ని 1885 లో అనువదించి ప్రకటించారు. వీరి అనువాదం సులభ సుందరంగాను సామాన్యులకు పఠన యోగ్యంగాను ఉంది. ఈ నాటకాన్ని ప్రధానంగా వీరు వంగదేశ వాసి యయిన శ్రీ తారానాథ తర్కవాచస్పతి పరిష్కరించిన ప్రతి ననుసరించి అనువదించారు. కాని ఆంధ్రదేశపు ప్రతి ననుసరించి కూడ నాటకీయమయిన కొన్ని మార్పులు చేసినారు.

ఈ నాటకంలోని కథానాయకుడు అగ్నిమిత్రుడు. మగధరాజయిన పుష్య

మిత్రుని కుమారుడు. నాయిక మాళవిక. నిసర్గ సౌందర్య సాలభంజిక. విదర్భ రాజయిన మాధవసేనుని సహోదరి. చిత్రరువులోని మాళవికను అగ్నిమిత్రుడు చూస్తాడు. ఆమె సౌందర్యానికి ముగ్ధుడవుతాడు. ఆమెను ప్రత్యక్షంగా చూడాలని వాంఛిస్తాడు. రాజు నర్మసఖుడు, విదూషకుడు అయిన గౌతముడు యుక్తిపన్ని, హరదత్త గణదాసులకు పరస్పర జిగీష కల్పించి, వారిరువురిలో ఎవరు విశిష్ట నాట్యకళాభిజ్ఞులో తేల్చుకోవడానికి వారు నేర్పుతున్న శిష్యులచే పోటీ పెట్టించాలని, న్యాయనిర్ణేతగా అగ్నిమిత్రుని నియమించాలని అంటాడు. అందుకు వారు అంగీకరిస్తారు. గణదాసు శిష్యురాలయిన మాళవికచే ముందుగా నాట్యం చేయిస్తారు. రాజు ప్రత్యక్షంగా మాళవిక మనోమంజులమయిన సౌందర్యాన్ని తనివితీరా చూచి ఉత్కంఠ చెందుతాడు. మాళవిక కూడ రాజుమీద మనసు లగ్నం చేసికొని విరహవేదన పొందుతుంది. వారి హృదయాల్లో నాటబడిన ప్రేమాంకురం పూచి ఫలించడానికి పరిస్థితులు సహాయ పడతవి.

సరసంగా సులభంగా, సుమధురంగా కవిగారు అనువాదం చేసారు.

"విద్య చేతనె సౌందర్య విభవమునను
ధాత యిట్టి యవ్యాజ సుందరిని జేసి
విషము పూసిన బాణంబు వేతోకండు
పంచ బాణునకిపుడు కల్పించె దాను. ద్వితీయాంకం.

## ప్రబోధ చంద్రోదయము :

ఈ నాటకాన్ని 1885 లో అనువదింప నారంభించి 1891 లో పూర్తిచేసి ముద్రించారు. సరళ రచననేగాక ప్రౌఢరచన కూడ చేయగల పాండిత్య ప్రకర్ష లేకపో లేదని చూపుటకు వారీరీతిగ అనువదించి తమపైగల ప్రవాదమును పోగొట్టు కున్నారు. కవిగారు. ఈ అనువాదము యథామూలకం. శ్రీకృష్ణమిశ్రుడు సంస్కృతంలో రచించాడు.

నాటకంలోని కథావస్తువు అద్వైత మత ప్రతిష్ఠాపన. నాయకుడు వివేకుడు. నాయిక ఉపనిషద్దేవి. ప్రతినాయకుడు మహామోహుడు.

ఆంగ్ల నాటకానువాదం :—

## కామెడీ ఆఫ్ ఎర్రర్స్ :—

దీనిని మహాకవి షేక్స్పియర్ రచించెను. ఈ నాటకాన్ని శ్రీ వీరేశలింగ కవీం

దుర్గిలు పూర్తిగా తెలిగించలేదు. దీని అనువాదన్ని 1875 లో ప్రారంభించి వివేక వర్ధని సంచికలు రెంటిలో ప్రకటించారు. తరువాత వారు దానిని ఆంధ్రీకరించలేదు. ప్రకటించలేదు.

## వెన్నీసు వర్తక చరిత్ర [Merchant of Venice :]

దీనినిగూడ రెండంకములు మాత్రమే ఆంధ్రీకరించారు. తక్కిన అంకములు లెందుకు తెనిగించలేదో కారణం అనూహ్యం. దీనిని 1880 సం॥లో తెనిగించారు. ఈ ఆంధ్రీకరణ అంత చెప్పుకోతగ్గదిగా లేదు. అనువాద వాక్యాలు ఆంగ్ల రీతిగానే ఉన్నవి కాని ఆ వాక్యాల్లో తెలుగుదనం కనిపించదు.

## చమత్కార రత్నావళి :

1878 సం॥లో అసమగ్రంగా తెనిగించిన "కామెడీ ఆఫ్ ఎర్రర్స్" 1880 సం॥లో చమత్కార రత్నావళి అనుపేర గద్యాత్మకంగా శ్రీ వీరేశలింగ కవీంద్రులు తెనిగించారు. ఈ నాటకం పాఠకులకు సుబోధం కావడం కోసం శ్రీ కందుకూరివారు మూలానుసారంగా అనువదిస్తూ కొన్ని మార్పులు చేసారు. నాటకానికి ప్రాణమయిన పాత్రల సంభాషణలను అతి విజ్ఞతతో సాగించినారు. ఈ నాటకం అనేక పర్యాయాలు పలు స్థలాలలో ప్రదర్శింపబడ్డది.

## రాగమంజరి :

ఆంగ్ల నాటకకారుడు సంఘ సంస్కరణాభినివేశియయిన శ్రీ రిచర్డు బ్రిన్స్లే షెరిడన్ డ్యూయన్నా అన్న నాటకాన్ని రచించాడు. ఈ నాటకాన్ని రాగమంజరి అన్న పేరుతో శ్రీ కందుకూరి 1885 సం॥లో గద్యపద్యాత్మకంగా ఆంధ్రీకరించారు. మన దేవాలయ పూజారుల మతాచార్యుల మధుసేవను, భక్తులిచ్చిన కానుకల కైంకర్యాన్ని దైనందిన చర్యల్ని లంచగొండి తనాన్ని చక్కగా తూర్పార బట్టినారు.

## కల్యాణ కల్పవల్లి ;

రిచర్డ్ బ్రిన్స్లే షెరిడన్ రచించిన "ది రైవల్స్" అన్న నాటకాన్ని శ్రీ కందుకూరి కల్యాణకల్పవల్లి అన్న పేరుతో అనువదించారు. దీనిని గద్యాత్మకంగానే పేరులు మార్చి, సన్నివేశ స్థలాలు మార్చి రచించారు.

శ్రీ కందుకూరి వారి ఆంగ్ల నాటకానువాదాలు అంత ప్రశస్తికెక్కినట్లు గానిపించదు.

## పౌరాణిక నాటకాలు :

ప్రహ్లాద, దక్షిణ గోగ్రహణం, సత్య హరిశ్చంద్ర అను మూడు నాటకాలు వీరి స్వతంత్ర రచనలు. తెలుగు గడ్డలో పురాణాల్లోని కథలను ఇతివృత్తాలుగా స్వీకరించి నాటక రచనకు శ్రీకారం చుట్టిన ప్రప్రథములు శ్రీ వీరేశలింగ కవీంద్రులు. వీరు స్వాతంత్ర్యేచ్ఛ గలవారు కావడంచేత వీరు తమ నాటక రచనలో ప్రాచీన లక్షణాల్ని పాటించకుండ రచనా స్వాతంత్ర్యాన్ని చూపారు.

## ప్రహ్లాద :

ఈ నాటకాన్ని 1885 వ సం।లో శ్రీ వీరేశలింగంగారు రచించారు. రాజమహేంద్రి నాటక సమాజం ఒకటి కవిగారిని తమ సమాజం ప్రదర్శించడం కోసం ప్రహ్లాద నాటకాన్ని రచించి ఈయవలసిందని అభ్యర్థించారు. నాటక కళ వేయిరేకుల పద్మంగా వికసించాలనే వాంఛగల శ్రీవీరేశలింగం 1885 వ సం॥లో ప్రహ్లాద నాటకాన్ని అతిత్వరలో వ్రాసి ఆ సమాజానికి ఇచ్చారు. పుస్తక రూపంగా ముద్రింపించారు.

## దక్షిణ గోగ్రహణం :

ఇది శ్రీమహాభారత విరాట పర్వములోని కథాభాగము. దీనిని 1885 లోనే కవిగారు రచించారు. కవిగారు తమ ఉపజ్ఞతో నాటకాన్ని రసమయం చేయవచ్చని భావించే ఆ కథను ఎన్నుకొన్నారు. తమ ప్రతిభా వ్యుత్పత్తులను ప్రదర్శించారు.

## సత్య హరిశ్చంద్ర :

దీనిని శ్రీ కవిగారు 1886 లో రచించారు. రాజమహేంద్రిలోని నాటకోజ్జీవన సమాజం వారు తమ సమాజం ప్రదర్శించడం కోసం హరిశ్చంద్రోపాఖ్యానాన్ని మార్చకుండ యథాతథంగా నాటకంగా రచియింపుడని శ్రీ కవిగారిని కోరగా రెండు మూడు వారాలలోనే నాలుగు అంకాలు రచించారు. అర్థించిన సమాజము వారప్పుడు ప్రదర్శించడానికి వీలుపడనందున కవిగారుకూడ నాటక రచన నంతటితో నిలిపివేశారు. కాకినాడలోని ఇంకొక నాటక సమాజంవారి అభ్యర్థనపై నాటకాన్ని పూర్తిచేసి వారం

దినాంలో వారికిచ్చారు. ఆ నాటక సమాజంవారు దానిని చక్కగా ప్రదర్శించారు. కవి గారు తమ స్వీయ చరిత్రలో పేర్కొన్నట్లుగా వారి మనోభీష్టమైన నీతి ప్రశంస, వ్యభిచారమును గూర్చి, స్త్రీ విద్యావశ్యకత గూర్చి, జ్యోతిషమును గూర్చి, తమ అభిప్రాయములను పాత్రల సంభాషణలో ఆయా యెడల నాటక కథాగతికి భంగం గాకుండా వెలిబుచ్చారు.

## సాంఘిక నాటకాలు:-

శ్రీ కందుకూరి స్వతంత్ర నాటిక రచనలు కూడ చేస్తూవచ్చారు. వానిని సాంఘిక నాటకాలని పేర్కొన వచ్చును. వీనిలో కొన్నింటిని ఆక్షేపగర్భ నాటికలని పేర్కొన్నారు.

బ్రాహ్మవివాహము, వ్యవహార ధర్మబోధిని, శ్రీ పునర్వివాహ నాటకము, కౌతుక వర్ధని, మునిసిపల్ నాటకము శ్రీ కవి గారి రచనలు.

తిర్యగ్విద్వన్మహాసభ, మూషకాసుర విజయము, మహారణ్య పురాధిపత్యము అనుకవి శ్రీ కందుకూరివారి ఆక్షేపగర్భ నాటికలు.

## బ్రాహ్మ వివాహము:-

శ్రీ కందుకూరి వారు ఏ రచన చేసినా దుష్ట ఛాందస సంప్రదాయాలు రూపు మాసి సంఘోద్ధరణ జరగాలని ప్రజ నైతిక ప్రవర్తనతో, నూతన చైతన్యంతో వర్ధిల్లాలనే సదాశయంతోనే బ్రాహ్మవివాహాన్ని వ్రాసి 1878 వ సం॥లో ప్రచురించారు. శ్రీ గురజాడ తమ కన్యాశుల్కాన్ని 1897 లో ప్రచురించారు.

వ్యవహార ధర్మబోధిని అనే నాటకాన్ని 1879 వ సం॥లో కవిగారు రచించారు ఆనాటి న్యాయవాదులు, న్యాయాధిపతులు, గుమాస్తాలు ధనం కోసం అమాయకుల్నిఎలా పీడించేవారో, లంచగొండి తనం ఎలా విహారం చేసిందో, సాక్ష్యాల్ని కల్పించి ఎదిరి వారిని ఎలా బాధపెట్టేవారో మన కళ్ళకు కనబడేటట్టు చిత్రించారు.

శ్రీ పునర్వివాహ నాటకమును 1879 ఆరంభంలో రచించి వుండవచ్చును. దీనిని కవిగారు సమగ్రంగా వ్రాయలేదు.

వివేకదీపిక నాటకాన్ని 1880 లో కవిగారు రచించారు. కథావస్తువు శ్రీపునర్వి వాహ విషయం. ఇదికూడ అసమగ్రం.

కౌతుక వర్ధని మూడంకాల నాటకం. ఇది కేవలం వ్యభిచార నిషేధం గూర్చి వేశ్యాలోలత్వం గూర్చి వ్రాసింది. అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్యలను విడచి భోగం వారి స్నేహం చేయడం అందువల్ల కలిగే గృహ కల్లోలాలు, వారివల్ల సంక్రమించే సుఖవ్యాధులు, నశించిపోయే ధనం, వచ్చేఅప్రతిష్ఠగూర్చి విపులంగా మనస్సును హత్తు కొనేలా చిత్రించారు.

మునిసిపల్ నాటకం పురపాలక సంఘ వ్యవహారాలను నిర్ద్వంద్వంగా తూర్పార బట్టింది. పురపాలక సంఘంలోజరిగే మోసాలు, తీసుకొనే లంచాలు, కోపంగా వున్నవారి మీద వ్రాసే ఆకాశ రామన్న ఉత్తరాలు, పడిరూపాయల లంచంకోసం కమీషనర్లు పడే పాట్లు ఆడే అబద్ధాలు ఈ నాటకంలో చక్కగా చిత్రించారు.

## ఆక్షేపగర్భ నాటికలు :—

1. తిర్యగ్విద్వన్మహా సభ 2. మూషకాసుర విజయం 3. మహారణ్య పురాధిపత్యం అను నాటికలను 1889 సం॥లో శ్రీ వీరేశలింగం రచించారు. ఆనాటి నికృష్టాచారాలను ఖండిస్తూ వ్యంగ్యంగా వ్రాసిన నాటికలు ఇవి. ఆక్షేపణ గర్భసంభాషణలతో కూడిన నాటికలివి. తమ ఆదర్శాలకు, తమ సంఘసంస్కారోద్యమానికి ప్రతికూలంగా ప్రవర్తించి, అభ్యంతరాలు కల్పించిన వారిని వారి పొరబాటును గ్రహించి సంస్కార పథంలో గమించడానికి అవహేళన చేశారు. అధిక్షేపించారు. అందుచేత ఈనాటికల్లో ఆక్షేపం కొంచెం శ్రుతి మించినదని చెప్పక తప్పదు. ఈ నాటికలు ఆనాటి సంఘంలో గాలిదుమారం రేపినవి. మలిన మనస్కులు భుజాలు తడుముకొన్నారు. వ్యాజ్యాలు వేశారు.

ఆక్షేపగర్భ నాటిక తెలుగు సాహిత్యంలో నూతన ప్రక్రియ. ఇది Satire పద్ధతికి ఛాయ. తెలుగు సాహిత్యంలో ఈ ప్రక్రియకు శ్రీ కందుకూరి శ్రీకారం చుట్టారు.

శ్రీ కవిగారి నాటికాలు ఆనాటి సంఘంలోని కుళ్ళును పెళ్ళగించాలనే తలంపుతో రచింపబడ్డవి. వారి రచనాప్రయోజనం ఫలించినట్లు కవిగారి స్వీయ చరిత్రవల్ల తెల్లమవు తున్నది. శ్రీకందుకూరి తమ నాటకాలలో విజ్ఞానాన్ని ముందుపెట్టి వినోదాన్ని వెనక్కు నెట్టి నాటకాల్ని రచించి తమ సంఘ సంస్కరణోద్యమానికి కరదీపికలు చేసికొన్నారు.

——

# మహాపురుషుడు — మహాకవి

డా॥ అరిపిరాల నారాయణరావు
తెలుగు అధ్యాపకుడు
శ్రీ వై. యన్. కళాశాల, నర్సాపురం.

"దేశం ఎంత పరుల పాదాలకింద నలిగి పోవాలో అంతగాను నలిగిపోయాక జాతి యెంతగా బానిస అయిపోవాలో అంతగానూ బానిస అయిపోయాకా, భాష యెంతగా శృంఖలాబద్ధం అయిపోవాలో అంతగానూ బానిస అయిపోయాకా, సాహిత్యం ఎంతగా దిగజారి పోవాలో అంతగానూ దిగజారి పోయాకా, భవిష్యత్తు ఎంతగా అంధకార బంధురం అయిపోవాలో అంతగానూ అంధకారబంధురం అయిపోయాకా, పుట్టకు వచ్చాడీ కవి" అని శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు గురజాడ గురించి అన్నమాటలు. కందుకూరి వీరేశలింగంకూడ ఆకాలంలోని వాడేకదా : శ్రీ పాదవారు గురజాడ ఉన్నకాలం గురించి చెప్పారు. ఆ మాటలు కందుకూరివారికి అన్వయిస్తాయి. దేశ, జాతి, సంఘ, కుల, మత దురాచార దుర్గమారణ్యంలో ప్రవేశించి సారస్వత కుఠారాలను చేబూని దశాబ్దాల కృషితో శతాబ్దాల పర్యంతము సుగమమైన మార్గాన్ని వేసి పోయిన వారు కందుకూరి గురజాడలు. ఒకరు మహాపురుషుడు. మరొకరు మహాకవి. ఒకరు ఆచరణలో చూపించారు. మరొకరు రచనల ద్వారా ఆలోచింప చేసారు.

కందుకూరి వీరేశలింగం గురజాడ వేంకట అప్పారావులు ఆకారాల్లో (చిత్రపటాల్లో) చూస్తే పెద్ద రౌడీలలాగ కనిపిస్తారు. తలపాగా, మెళ్ళో గళ్ళ మఫ్లరు ఇదీ వీరేశలింగం వేషం. పెద్దతలపాగా, పెద్దమీసాలతో గురజాడ ఉంటాడు. సైడుఫోజులో చూస్తే ఇంత బలిష్టుడా అనిపిస్తుంది. కాని పిట్టంత మనిషి గురజాడ. విచిత్రమేమంటే ఇద్దరూ అలా రౌడీల్లా కన్పించినా, నిత్య అనారోగ్య పీడితులు. వీరేశలింగం తన స్వీయచరిత్రలో "నాకు శైశవము నుండియు నుండిన దగ్గునకు తోడుగా నజీర్ణాతి సారములు కూడ నన్నాశ్రయించినవి. 1863 సంవత్సరమునుండి 1864 వ సంవత్సరాంతము వఱకును నేను మరణ జీవితముల మధ్య నూగులాడు

పుంజిని" అని వ్రాసికొనారు. మిగిలిన రోగాలు తగ్గినా దగ్గు మాత్రం నేనున్నానంటూ వీరేశలింగానికి గుర్తు చేస్తుండేది.

గురజాడ విషయంలో మాత్రం అలాకాదు. జీవితాంతం ఉబ్బసం ఆయనకు తోడుగనే ఉన్నది. "ఉబ్బసంతో వొగుర్చు కుంటూ కుళ్ళు దగ్గుకుంటూ అప్పారావు గారు తీర్మానం బలపరచి నేను బలపరచాను, అని రామ్మూర్తి పంతులుగారి చెవిలో నోరు పెట్టి ఇంగ్లీషులో గట్టిగా కూడ చెప్పారు" అని ఒకచోట శ్రీపాద సుబ్రహ్మణ్యం గారు వ్రాసారు.

ఇంతకీ ఇద్దరూ గండాలు గడచిన వారు. మంచాల మీదనుండి క్రిందికి దింపిన దాఖలాలున్నాయి. బ్రతికి బట్టకట్టారు. బట్టకట్టటమే కాదు. సాహితీ సీమంతినికి నిండుగా బట్ట చుట్ట బెట్టారు. అంతకుముందు కవి పుంగవులు అంగాంగ సౌందర్య వర్ణనలతో ఇంచుమించుగ దిగంబరత్వాన్ని కలిగించారంటే అతిశయోక్తి కాదు, ఇక ప్రస్తుతానికి వద్దాం.

వీరేశలింగం చూపిన ఆచరణలు చాలవరకు గురజాడవారి రచనల్లో చోటుచేసి కొన్నాయి. "వీరేశలింగం సంఘంలో లేవదీసిన విప్లవ తరంగం మీద నురుగే గురజాడ అప్పారావు సాహిత్యం సమస్తం. అభినవ భావ చైతన్యం ఒకరిలో సంఘసంస్కరణనీ, మరొకరిలో సంఘసంస్కరణ పరాయణమైన సాహిత్యసృజననీ ప్రేరేపించింది" అని కె. వి. రమణారెడ్డి గారంటారు. సామ్యాలు కూడ అలాగే కుదురుతుంటాయి. ప్రజల మూఢ నమ్మకాలమీద కందుకూరి గురజాడ ఇద్దరికీ అవహేళనున్నది.

వీరేశలింగం కోరంగిలో ఉన్నకాలంలో భూతవైద్యునితో గొడవ జరిగింది. వీరేశలింగం తల్లి అనారోగ్య పీడితురాలు. పిశాచాదిక భ్రమలు ఆమెకున్నాయి. కాదన లేక భూతవైద్యుడ్ని కుదిర్చాడు వీరేశలింగం. స్వస్థత పడిన తర్వాతే బహుమతి ఇస్తానన్నారాయన. భూతవైద్యుడు డబ్బుగుంజాలనుకున్నాడు కాని వీలు పడలేదు. ప్రయోగాలు చేసి చంపుతానని ప్రగల్భాలు పలికాడు వైద్యుడు. ఉపవాసదీక్ష ప్రారంభించాడు. మనిషి నీరసించి పోయాడు. శరభసాళ్వమును తన మీద ప్రయోగించాడని తన్ను చూడవచ్చిన వారికి భూతవైద్యుడు చెప్పడం మొదలు పెట్టాడు. రెండు రోజులు పోయిన తరువాత తానే వెళ్ళి నీరసంతో ఉన్న భూతవైద్యుడ్ని ఇంటికి తీసుకువచ్చి యధాస్థితికి వచ్చేవరకు మేపాడు. దెయ్యాలు లేవని నిరూపించడానికి చక్కటి అవకాశం కలిగింది కందుకూరి వారికి.

దెయ్యాలు లేవని నిరూపించడానికి గురజాడ కన్యాశుల్కంలో అవకాశం తీసు కున్నాడు పూజారి గవరయ్య లుబ్ధావధానులు దగ్గర డబ్బుగుంజడానికి దెయ్యాల్ని అసరాగా చేసుకుంటాడు. లుబ్ధావధాన్లు పెళ్లాడిన పిల్ల యొక్క మొదటి మొగుడు చనిపోయి బ్రహ్మరాక్షసి అయ్యాడని, వాడువచ్చి పెళ్ళికూతుర్ని ఎగరేసుకు పోయాడని చెబుతాడు. పెళ్ళికూతురు కామినీ పిశాచి అని ఇద్దర్నీ సీసాలో బంధించినట్లు చెబుతాడు. సీసామూత తీసేస్తే మళ్ళీ దయ్యాలు పీడిస్తాయని భయపెడతాడు. సీసాలలో దెయ్యాల్ని దింపడమనే తతంగాన్ని నిత్యజీవితాల్లో ఈ నాటికీ చూస్తున్నాం. దెయ్యాలు భూతాలు వగైరాలు లేవనే అభిప్రాయాన్ని దృఢతమం చేసేకాలంగురించి ఎదురుచూద్దాం.

సమకాలాన్ని నిశిత పరిశీలనచేసి, భవిష్యత్కాలాన్ని సూచన చేయగల మేధావుల భావాలు ప్రస్ఫుటమవుతూనే వుంటాయి. సాధారణ మేధావులు వాళ్ళ లోటుపాట్లను వాళ్ళు తెలుసుకోలేరు. పొందిక ఉండదు. గమ్యం ఉండదు. మరి కందుకూరి గురజాడలు అసామాన్యులు. వాళ్ళ గమ్యం వాళ్ళకి తెలుసు. వాళ్ళకేదికావలో తెలుసు. ప్రజలకేది అందించాలో తెలుసు. అందుకేవారి రచనల్లో స్పష్టత ఉంటుంది. నిజం వుంటుంది.

బాల్యవివాహాల వ్యతిరేకత, కన్యాశుల్క దురాచార నిర్మూలన, స్త్రీ పునర్వివాహాలు, పడుపు వృత్తి నిషేధం మొదలగునవి వారిరచనల్లో చోటుచేసు కుంటాయి.

ఆనందగజపతి చేయించిన పరిశోధనల్లో సంవత్సరం వయస్సు కలిగిన పసి పాపలకు కూడ వివాహాలు జరిగాయి అని తేలిందంటే అంతకంటే విచారించగల విషయం ఇంకేముంటుంది. గురజాడ కన్యాశుల్క మొదటిముద్రణ పీఠికలో ఎంతెంత చిన్నవయసు పిల్లలకు వివాహాలు జరిగాయో జాబితా ఇచ్చాడు.

వీరేశలింగం ఒక ప్రహసనంలో పొత్తిళ్ళలోవున్న బిడ్డలనేకాదు పొట్టలో వున్న బిడ్డలను అమ్మిన వైనం చూపిస్తాడు. అసలు ఆ సంభాషణా విధానమే ఒకప్రక్క ఆశ్చర్యం మరొక ప్రక్క అసహ్యం కలుగుతుంటుంది. కందుకూరి వ్రాసిన 'కన్యాశుల్క' ప్రహసనంద్వారా పరికించండి.

కామావధాన్లు : నేను అయిదారుగురు పిల్లలను అమ్ముకొని శాస్త్రసొమ్ము చేసుకొన్నానని ఓర్వలేని గాడిదకొడుకులకుకన్నెర్రగా వున్నది. నేను కష్టపడి కను

క్కున్న నా పిల్లలను అమ్ముకున్నానుగాని పూర్వోవాళ్ళ పిల్లలను అమ్ము కోలేదుగదా !

రామశాస్త్రి :- ఈ కబుర్లకేమిగాని సోమిని నాకివ్వడం యేమి చేసినావు. దానికి నాలు గేళ్ళు వెళ్ళి వస్తూవున్నవి కాబోలును.

కామావధాన్లు :- దాన్ని నీకివ్వడానికివల్లపడదు. ఇదివరకేదాన్ని యీవూళ్ళో పూటకూళ్ళు పెట్టే రెండుచింతల వెంకయ్య గాడికి యివ్వడానికి నిశ్చయించి ఆరువందల రూపాయలు పుచ్చుకున్నాను.

రామశాస్త్రి :- ఈ మాటలకేమిగాని నీ పెళ్ళానికి యిప్పుడు నెల తప్పిందేమో చెప్పు.

కామావధాన్లు:- రెండు నెలలు వెళ్ళి మూడోనెల చొరబడ్డదని చెప్పుకుంటూ వున్నారు. ఆ కడుపులో పిల్లకి యేమి యిస్తావో చెప్పు ఇప్పుడే బేరముపరిష్కా రించు కొందాము. ఆరు వందలరూపాయలు యిస్తానని నీవు ఇప్పుడన్న మాట తిరిగి పోకూడదు సుమా !

రామశాస్త్రి :- ఆరువందల రూపాయలు నేను పెద్దపిల్లకు ఇస్తానన్నానుగాని కడుపులో వున్నదానికి ఇస్తాననలేదు. దీని కయితే మూడు వందల రూపాయల కంటె యెక్కువ యివ్వను.

కామావధాన్లు:- సాహసం ఎవ్వరికైనా వుండవలెను. అలాగే వప్పుకుంటా. మూడు వందల రూపాయలు తెచ్చి సాయంత్రంలోగా నా చేతిలోపొయ్యి. బజా రులో వుప్పు చింతపండు వలె దీనికి అరువు బేరము లేదు. రొక్కము గుమ్మరించవలెను.

రామశాస్త్రి :- తరువాత మగాడు పుడితేనో

కామావధాన్లు:- మూడువందల రూపాయలు తక్కువ చేసినప్పుడు ఆ లాభనష్టాలన్ని నీవే మగపిల్లవాడు పుట్టినా, కడుపు దిగపడి పోయినా, పుట్టిన బిడ్డ చచ్చినా నాకు యిచ్చిన దానిలోనుండి నీకు చిల్లుగవ్వ ముజరారాదు.

గురజాడవారు బాల్యవివాహాలు వలన కలిగిన ఫలితాలను కన్యాశుల్క నాటకంలో చూపిస్తాడు. అగ్నిహోత్రావధాన్లు పెద్దకూతుర్ని అమ్మి డబ్బుచేసుకుంటాడు.

వ్యక్తురాలు కాకముందే కట్టుకున్నవాడు 'హరీ' అనగా ఆ ఆస్తి కూడా లాగుతాడు. రెండవ కూతురు సుబ్బిని కాటికి కాళ్ళు చాచుకున్న లుబ్ధావధాన్లకు అమ్మ చూపుతాడు.

లుబ్ధావధాన్లు కూతురు మీనాక్షికి చిన్నపుడే వివాహం అవడం, మొగుడు కాలంచేయడం, ఆమె ప్రక్కదార్లు పట్టడంలాంటి విషయాలు కళ్ళకు కట్టినట్టు చూపుతాడు.

ఇంక పునర్వివాహాల ప్రసక్తికి వస్తే కందుకూరివారు చాలా కష్టనష్టాలకు గురయి ఉద్యమం నిర్వహించవలసి వచ్చింది. స్త్రీ పునర్వివాహాలు చేస్తే వెలివేస్తామని 'విరూపాక్ష శృంగేరిస్వామి'వారు ప్రకటించారు.

పోలీసు బందోబస్తుతో, విద్యార్థుల అండదండలతో విధవా వివాహాలు నిర్వహించారని చెప్పడం ఈ నాడు ఆశ్చర్యం మాత్రం కలగవచ్చు. కాని ఆ నాడు అనుక్షణం భయంతో, తనకి తానే ధైర్యం చెప్పుకుని వివాహాలు చేయించాడు కందుకూరి.

ఎంతెంతో దూరదేశాలనుండి వచ్చిన వాళ్ళకు ఆశ్రయం కల్పించడం, తగిన వ్యక్తులకిచ్చి వివాహాలు చేయించడం వీరేశలింగం స్వీయచరిత్ర సాక్ష్యం పలుకుతుంది. మొండివాడు కాబట్టే ముందడుగు వేయగలిగా డాయన. సంస్థలు నిర్వహించ గలిగాడు.

గురజాడ పై సంస్థల నాధారం చేసుకొనే కన్యాశుల్క నాటకంలో తన అభిప్రాయాల్ని ఉట్టంకిస్తాడు. "ఇప్పటికైనా మీకు నమ్మకం కలిగితే యిలాంటి దురాచారాలు మాన్పడానికి రాజమహేంద్రవరములో పక సభవుంది ఆ సభకి కొంచవోం గొప్పో మీకు తోచిన డబ్బు యివ్వండి. వితంతువుల మఠానికి మీ పిల్లలకి పంపడం నా సలహా''అని సౌజన్యరావు పంతులు లుబ్ధావధాన్లుతో చెబుతాడు.

మరోచోట సౌజన్యరావు పంతులు గిరీశంతో "బుచ్చెమ్మని పూనాలో విడోస్ హోమ్‌కు పంపమని మీ గురువుగారి పేరిట ఉత్తరం యిస్తాను''అని అంటాడు.

మూఢాచారాలను తూర్పారబడతా రిద్దరు ప్రసక్తయా. కందుకూరి ఒక ప్రహసనంలో ఏటిగట్టునుండి ఇంటికి నీళ్ళ తేవడానికి ఒకస్త్రీపడే పాట్లను వర్ణిస్తాడు. వాళ్ళ చూసారనీ, పీళ్ల తగిలారనీ, అస్పృశ్యు డెదురయ్యాడని, ఇంకా అనేక పర్యాయాలు ఆమె స్నానం చేస్తుంటుంది, బయటకు వెళ్ళాడని జ్వరంతోవున్న

కుష్ఠాదికి స్నానం చేయించేస్తుంది. మరో యిల్లాలు వీరేశలింగంగారి కాలంలో జరిగిన సంఘటన ఒకాయన చెప్పగా విన్నది. ఇక్కడి ప్రస్తావనకు దూరంకాదు. పెళ్ళి పంటసావిట్లో విశ్వస్త కన్పించిందని భోజనంచేయమని, బ్రాహ్మణ్యం లేచిపోయింది, కాని పదార్థాలు మాత్రం జిహ్వాచాపల్యాన్ని ఆకట్టుకున్నాయి. పదార్థాలు వదలలేరు పంక్తిలో కూచోలేరు. ఇదీ సంకట పరిస్థితి. అప్పుడో బుద్ధిమంతుడు "తైలపక్వం నదూష్యతే"అని చేసిన సవరణతో మళ్ళీ పంక్తిలో బ్రాహ్మణ్యం కూర్చున్నారనీ, ఈ సంఘటన యధార్థమే అయ్యుంటుంది కదూ !. ఇవన్నీ కృత్రిమాలనీ నొక్కి చెబుతాడు కందుకూరి.

దానాలపేరిట బ్రాహ్మణ్యానికి తలవంపుతెచ్చే ప్రయత్నాలు ఎలావుండేవో గురజాడ కొండుభట్టీయలో చూపిస్తాడు.

మంజువాణి ! ... యీ తాపు మదనశాస్త్రంలోని క్రియకింద పరిగణన అవుతుందా?
భూసురోత్తముల తన్నని పాపము కింద పరిగణన మవుతుందా ?

కొండు : పది రూపాయలు పారేస్తే పుణ్యంకింద పరిణామం అవుతుంది.

ఇంతకీ సాని అయిన మంజువాణి బ్రాహ్మణుడయిన కొండుభట్లుని తన్నింది. పై సంభాషణ ఆ సందర్భము లోనిది.

ఒకటికాదు అనేకసంఘటనల్లో గురజాడ బ్రాహ్మణమూఢాచారాల్ని, హైన్యాన్ని చూపుతాడు.

సాని మేళాలు ప్రబలంగా వున్నరోజులవి. నాయుడిగారి మేళం, శాస్త్రిగారి మేళం అను పేర్లతో కొన్ని మేళాలే నిర్వహించబడుతూ వుండేవంటే భోగం మేళాల కిచ్చిన ప్రాముఖ్యతేమిటో తెలుస్తుంది. ఏ శుభకార్యం అయినా మేళం పెట్టాల్సిందే, రూకలు చెల్లించాల్సిందే. అది వారి దర్జాకి, హుందాకి చిహ్నం, వీరేశలింగం ఎన్నో సంఘటనలు తన స్వీయచరిత్రలో ఉట్టంకించారు. ప్రహసనాల్లో చొప్పించారు.

గురజాడ కూడా అవకాశం తీసుకున్నాడు. "ఫలానా పంతులుగారు ఫలానా సానిని వుంచుకొని బాగుపడ్డారంటే గౌరవం"అని మధురవాణిచేత చెప్పిస్తాడు గురజాడ మధురవాణి మేళం లుబ్ధుని పెళ్ళిలో పెట్టిస్తానని రామప్పపంతు లంటాడు. కన్యాశుల్కంలో, కొండుభట్టీయంలో కావలసినన్ని ఉదాహరణలు.

వేశ్యా సంస్కరణ పేరుతో జరుగుతున్న మోసాలు, సంస్కరించాలనే తపనే కాని మార్గం చూపడంతెలియని సంస్కర్తలని మనముందుంచుతాడు గురజాడ. "సరళ అనే వేశ్యాకన్య చేతిలో సంస్కర్తయిన రంగనాథయ్యరు పడడం, పరాభవం పొందడం మొదలయిన అంశాన్ని" సంస్కర్త హృదయంలో చూపుతాడు ప్రముఖ గురజాడ. అట్లాగే కన్యాశుల్క నాటకంలోకూడ. "అట్టేసేపు నువ్వు నాయెదుట గాని నిలిచివుంటే నువ్వు యేతగువుతీరిస్తే ఆ తగువునకు వొప్పుదల అవుతానేమో అని భయం వేస్తుందని" సౌజన్యారావు పంతులు మధురవాణి ముందు తలవంచుతాడు. కొందరు సంస్కర్తలు పగలు యాంటినాచ్, రాత్రుళ్ళ ప్రోనాచ్, ఇది ఆనాటి తీరు.

ఇంతకి చెప్పొచ్చేదేమిటంటే పడుపువృత్తిలో వుండే హైన్యాన్ని చూపి సక్రమ మైన మార్గంలో నడపడానికి కందుకూరి గురజాడలు కంకణం కట్టుకున్నారని చెప్పక తప్పదు.

స్త్రీల విద్యాభ్యాసం దాని వలనకలిగే మేలు తెలియ చెప్పడానికి ఆనాటి సంస్కర్తలు చాలశ్రమ పడవలసి వచ్చింది. కందుకూరి సభలుచేసి పెద్దలను రప్పించ గలిగాడు. బాలికా పాఠశాల నెలకొల్పడం జరిగింది. కొందరు తమ ఆడవాళ్ళు చదువు కోవడం ఇష్టమేకాని చదివించడానికి బిడియపడుతుండే వారు. అటువంటి వారి స్త్రీలకు వారి అనుకూల సమయాన్ని బట్టి మేడమీద ప్రత్యేకముగ జనానా తరగతులు పెట్టి నట్లు వీరేశలింగం తెలిపారు. స్త్రీల విద్యాభ్యాసం తమను తాము తెలుసుకోవడం, భర్తలను సక్రమమైన మార్గంలో నడుపుకొనడం లాంటిదని కూడ చెప్పడం జరిగింది

గురజాడ 'దిద్దుబాటు' అనే కథ దీనికుదాహరణ. వేశ్యాలంపటుడై యున్న భర్తకు చీటీ వ్రాసిపెట్టి సక్రమమైన మార్గంలో పెట్టి దిద్దు కొంటుందొక గృహిణి. ఆడవాళ్ళు చదువు కోవడం వలన కలిగే మేలుని రచయిత కథలో కొంత చర్చిస్తాడు.

కందుకూరి రచనల నుండి సూత్రాలు, గురజాడ రచనలనుండి ఉదాహరణలు తీసుకోవడమే కావచ్చు. సమన్వయానికి తంటాలు పడడంకాదు. సమకాలాన్ని వాళ్ళ రచనల్లో ఎలా ప్రతిబింబింప చేసారో, ఫలితాలేమిటో చూపడమే ఆశయం.

బెంగాలులో బ్రహ్మసమాజం తీవ్రప్రచార రూపం దాల్చినకాలం. విస్తృత ప్రచారం లభించిందనేక ప్రదేశాల్లో, ఆంధ్రదేశంలో రఘుపతి వెంకటరత్నంనాయుడు మొదలగువారు బ్రహ్మసమాజ మతం స్వీకరించారు. ఏకేశ్వరోపాసన కలిగిన బ్రహ్మ

సమాజ ప్రార్థనామందిరం వెలసింది. కందుకూరికి దానిపై గురి కుదిరింది. ప్రార్థనా మందిరం రూపుదిద్దుకున్నది. మతాలపేరిట జరుగుచున్న మోసాలు కొన్ని మూఢ నమ్మకాలు కందుకూరికి అవగాహన కాకపోలేదు ఆయన దృష్టినుండి తప్పించుకోలేకపో యాయి. వాటిని నిరసించారు. కాని బ్రహ్మ సమాజమునందు గురి కుదిరింది. ఏకేశ్వరోపాసన నచ్చింది. మిగిలినవి ఆడంబరాలనుకున్నారు.

గురజాడకు మతాలపై నమ్మకంలేదు. గురజాడ కథానికల్లో, దేవుడు చేసిన మనుషుల్లారా ! మనుషులు చేసిన దేవుళ్ళారా ! మీ పేరేమిటి ? అనే కథ వున్నది. శైవ, వైష్ణవ, బౌద్ధ, మొదలగు మతాలనుగూర్చి చర్చకు తీసుకువస్తాడు. "శివుడన్నా విష్ణువన్నా, బుద్ధుడన్నా ఆ పరమాత్ముడు ఒక్కడే కదా! అంటూ కథాంతములో వెంకయ్యనే పాత్రచేత ఒక్కమాటన్పిస్తాడు. "అందరుదేవుళ్ళూ వక్కరే అయితే ఆ పీనుగుల్ని అందర్నీ ఒక్కచోటే నిలిపి అందరూకలసి పూజ తగలెట్టరాదా ? అని చర్చించు కుంటూపోతే అడుగడుగునా కన్పిస్తూనే వుంటాయి. గురజాడ మానవతావాది దేవుడెక్కడో వున్నాడని కొండలు కోనలూ వెదకనక్కర లేదు. కన్ను తెరిస్తే మీ ముందే కన్పిస్తాడంటాడు "మనిషి" అన్న గేయంలో

కన్నుతెరచిన కానబడడో
మనిషి మాత్రుడ యందులేడో
యెరిగి కోరిన కరిగి యీడో
ముక్తి

కులాల పట్టింపు విషయంలో తీవ్రమైన నిరసన వ్యక్తం చేసారు. కందుకూరి గురజాడలు. వాళ్ళ రచనలు చోటుచేసు కున్నాయి. మంచి చెడ్డలు రెండే వాళ్ళ దృష్టిలో వున్నవి. కులాలు కాదు.

రచనా ప్రక్రియలన్నిటిలో ఆద్యుడయ్యాడు కందుకూరి. రచనలకు మెరుగులు దిద్దాడు గురజాడ. "కందుకూరి రచనలు తెలుగు సాహిత్యంలో సంస్కరణ ధోరణులు ప్రవేశపెడితే విప్లవాత్మకమైన మార్పులు తీసుకువచ్చిన ఖ్యాతి గురజాడ అప్పారావుది" అని శ్రీశ్రీ అంటాడు. అంతెందుకు గురజాడే కందుకూరిని గూర్చి 1911 జనవరి 12వ తేదీన తన డైరీలో "శ్రీవీరేశలింగం నిశ్చయముగా మహాపురుషుడు. సాహిత్యంలో ఒక శాఖను ప్రారంభించి; సంఘంలో పురోభివృద్ధి పంథా లేవదీసిన మాన్యుడు." అని వ్రాసుకున్నాడు.

భాషావిషయకంగా కందుకూరి మొదట గ్రాంథికవాది. కాని చివరలో వ్యావహారిక వాదిగా మారిపోయాడు. తాను చేస్తున్న సంస్కరణ ప్రజల్లోకి వ్యాపించాలంటే అదేసరయినదను కున్నాడు. మొదట్లో క్లిష్ట గ్రాంధికాన్ని చవిచూచాడు. గారడీలు చేసాడు. శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన రామాయణాదులు, పంచతంత్రములు సాక్ష్యాలుగా మిగిలాయి. సాహిత్యాన్ని కవులు దిగజార్చిన వైనం గమనించాడు. కందుకూరి తలకట్లతో, ప్రాసలతో అలంకారాదులతో కుంగిపోయిన సరస్వతి విలపించడం కళ్ళకు కట్టాడాయన. అందుకే అన్నిటినీ విడచి జవ జీవాలున్న భాషనందుకున్నాడు. సాహితీ ప్రక్రియలను సస్యశ్యామలం చేసాడు.

గురజాడ మొదటి నుండి వ్యావహారిక భాషా వాది. గిడుగు వెంకట రామ్మూర్తి లక్షణాలు రూపొందిస్తే, లక్ష్యాలు గురజాడ చూపాడు మనుషుల నాల్కల మెసలేభాష నాదను కున్నాడు గురజాడ. వ్యావహారిక భాష నాటక రచనకనుకూల మయినదని సవాలుచేసి చూపించాడు. కందుకూరి గురజాడ రచనలు వాళ్ళ భాషావై లక్ష్యాలకు అద్దంపట్టాయి.

నిస్వార్ధానికి మారుపేర్లుగ కందుకూరి గురజాడలు దర్శనమిస్తారు. లేమినుండి సోపానాలు అధిగమిస్తూ చేయూతనిచ్చిన త్యాగమూర్తి కందుకూరి. అనేక సంస్థలు స్థాపించి అన్నికులాల వారికి ప్రాతినిధ్య మిచ్చి తనకుతానే సాటి అన్పించుకోగలిగాడు. ధనసేకరణకు అవమానాలు అధిగమించి లక్ష్యసిద్ధి పొందగలిగాడు.

ఆనందగజపతి మరణానంతరము సంస్థానం కోర్టుగొడవల్లో పడింది. గురజాడ నిస్వార్థ బుద్ధితో ప్రవర్తించాడు గాబట్టి విజయరామ గజపతి నిలబడ గలిగాడు. గురజాడను ప్రతిపక్షులు డబ్బును ఎరచూపి లాగాలను కున్నారు. ''నేను అజీర్ణ రోగిని ఒక తెళ్ళెడు అన్నం అరగించుకోవడం నాకు కష్టం. గోనెడు కరుకు రూపా యిల్ని యెలా అరగించుకోను'' అని చమత్కారంగా చెప్పాడు గురజాడ. సంపాదనే ముఖ్యం అనుకుంటే అంత సంస్థానంలో ఎంతైనా సంపాదించి వుండేవాడు. డబ్బు వాళ్ళకు తృణప్రాయం విజయరామగజపతితో లలితకుమారి దేవి వివాహ విషయంలో కూడ తన నిస్వార్థతను వెల్లడించు కొన్నాడు గురజాడ.

నమ్మిన సిద్ధాంతాలకు కందుకూరి గురజాడలు తలవంచారు. అందుకే ఈ నాడు వాళ్ళు తలయెత్తుకొని కన్పిస్తున్నారు మనకి.

——

# శ్రీ వీరేశలింగంగారి నవలలు

ఆర్. ఎస్. సుదర్శనం

"తెలుగులో మొదటి వచన ప్రబంధమును నేనేచేసితిని" అని శ్రీ వీరేశలింగం గారు 'రాజశేఖర చరిత్రము'' నుద్దేశించి తమ స్వీయచరిత్రలో చెప్పుకొన్నారు. "రాజశేఖర చరిత్రము" 1878లో వివేకవర్ధనిలో ప్రచురింపబడి 1880లో పుస్తక రూపం దాల్చింది. "కాని వేయిప్రతులుగల మొదటికూర్పు అమ్ముడుపోవుటకే బహు సంవత్సరములు పట్టినది. అందుచేత నిప్పుడు నవలలనబడెడు వచన ప్రబంధములను వ్రాయు ప్రయత్నమును మానివేసితిని" అన్నారు పంతులుగారు. కాని స్త్రీల కొరకు పుస్తకములు వ్రాయవలెనను ఉద్దేశముతో 1883లో 'సత్యవతీ చరిత్రము' అనే వచన ప్రబంధాన్ని వ్రాశారు. 1891లో వ్రాసిన "సత్యరాజ పూర్వదేశయాత్రలు" గ్రంధాన్ని పంతులు వచన ప్రబంధముగా పేర్కొన లేదు. నవలా ప్రక్రియయొక్క బహుముఖ విన్యాసాన్ని అవలోకించినప్పుడు "సత్యరాజ పూర్వయాత్రలు" గ్రంధం యొక్క "ఆడమళయాళమ"నే ప్రథమ గ్రంథాన్నికూడా నవలగానే పరిగణించటానికి వీలున్నది.

పంతులుగారు "నవల"కు ఉద్దేశించిన లక్షణాన్ని 'సత్యవతీ చరిత్రము' తొలి పుటల్లో స్పష్టం చేశారు. "మన శృంగార ప్రబంధముల యందువలె దీనియందు దీర్ఘసమాసములతోడను గూఢపదములతోను వనవిహారము, జలక్రీడ, వధూవరుల యన్యోన్యవరణము మొదలైన వర్ణనలు సహిత మెక్కడను కనబడవు. ...యావజ్జీవ మును సుఖదుఃఖములకు పాలికాపులయి యుండవలసిన కన్యావరుల యిష్టమునసుసరించి వివాహములు జరిగెడి యుత్తమకాల మడుగంటి తమ వినోదార్థముగా తలిదండ్రులు నోరెరుగని శిశువులను పల్లకులలో పెట్టి యూరేగించి ఎల్లకాలమును వారిని బద్ధులను గావించెడు బొమ్మల పెండ్లిండ్లు చేసెడు కాలమిప్పుడు సంప్రాప్తమయినది. కాబట్టి ఈ నిజమయిన చరిత్రమునందు తేటతెలుగు మాటలలో మీరీకాలమున సర్వసాధారణ ముగా కుటుంబములయందు చూచుచుండునట్టియు అనుభవించుచుండునట్టియు సామాన్య విషయములే కనబడును గాని యింద్రజాలము లేవియు కనబడవు. విరుద్ధములైన

కల్పనా కథలను వినమరిగిన మీ చెవులకు ఈ సత్యచరిత్రము రుచింపనేని, దీని చదివి యానందింపను, దీనియందు వర్ణింపబడిన యోగ్యుల ప్రవర్తనను అనుసరింపను మీకు కావలసినంత స్వాతంత్ర్యము కలదు.'' (సత్యవతీ చరిత్రము : మొ.ప్ర.)

ఇంగ్లీషులో 18వ శతాబ్దిలో నవలా ప్రక్రియ ప్రారంభమైనప్పుడు దాని ప్రధాన వస్తువు స్త్రీ పురుషుల ప్రణయము; ఉత్సాహాన్నీ అద్భుతాన్నీ కలిగించే అనుభవాలూ, రసవత్తర సన్నివేశాలు. తెలుగులోకూడా వీరేశలింగంగారికి పూర్వమే 1872లో శ్రీ నరహరి గోపాలకృష్ణమచెట్టి అనే రెవిన్యూఉద్యోగి 'శ్రీరంగరాజ చరిత్రము' అనే నవల వ్రాశారు. అందులో ప్రణయమూ. వీరోచితమైన గాథా వస్తువు అయ్యాయి. 19వ శతాబ్దిలో వాస్తవికతను ఆలంబనం చేసుకున్న నవల ఫ్రాన్సులోనూ ప్రభవించింది. వీరేశలింగం పంతులుగారు తమ 'రాజశేఖరచరిత్రము' 'సత్యవతీ చరిత్రము' నవలల్లో వాస్తవికతనే ప్రధాన లక్షణం చేశారు. కన్యావరుల యిష్టములేని బొమ్మల పెండ్లిండ్లు, బాల్య వివాహములు జరుగుతున్న సమాజములో ఆమోదయోగ్యమైన ప్రణయాన్ని ఎక్కడనుంచి తీసుకురావాలి ? అని పంతులుగారి ప్రశ్న. చిలకమర్తివారు "రామచంద్ర విజయము" వంటి సాంఘిక నవలల్ని పంతులుగారి వరవడిలోనే వ్రాశారు. కాని "చింతామణి" పత్రిక వార్షిక బహుమతిని ప్రకటించడంతో 1896లో "హేమలత", 1897లో "అహల్యాబాయి", 1898లో "కర్పూరమంజరి" వంటి చారిత్రక కాల్పనిక నవలల్ని చిలకమర్తివారు స్కాట్ వర వడిలో వ్రాశారు. అది చాలమందికి వరవడి అయింది. మళ్ళీ 1921లో 'మాలపల్లి' వచ్చేదాకా సామాజిక వాస్తవికతను ప్రతిబింబించిన నవలలు తెలుగులో లేనట్లే !

రాజశేఖరుని చరిత్ర 'యించుమించు రెండువందల ఏండ్ల' నాటిది అని నవల చివర పంతులుగారు చెప్పినప్పటికీ అది పంతులుగారు బాగా ఎరిగిఉన్న సమాజానికి ఒక యాభైఅరవై ఏళ్ళ పూర్వరూపమే తప్ప, 17వ శతాబ్ది చరిత్రమాత్రం కాదని తోస్తుంది. వ్యవస్థ జమిందారీ వ్యవస్థ. అందులో అగ్రవర్ణమైన బ్రాహ్మణ్యము స్థితిగతులూ, ఆ వర్గంలోని వ్యక్తుల సంస్కృతి, జీవన వైఖరి, ఆచారాలూ, అలవాట్లూ స్పష్టంగా చిత్రించారు పంతులుగారు. 'సత్యవతీ చరిత్రము' సమకాలీనమని పంతులుగారే అన్నారు. 'రాజశేఖర చరిత్రము' నాటి జీవనవైఖరికీ 'సత్యవతీ చరిత్రము'నాటి జీవన వైఖరికీ పెద్దతేడా కనిపించదు !.

ఆయనది విమర్శాత్మక వాస్తవికత. దీన్ని ***Critical Realism*** అని

పాశ్చాత్యసాహిత్య విమర్శకులు వ్యవహరిస్తారు. అంతే కాదు పంతులుగారిది *Ethical Realism* అని కూడా చెప్పాలి. విమర్శించడమే కాకుండా వ్యక్తుల ప్రవర్తన ఎలా ఉండాలోకూడా ఆయన ప్రబోధిస్తారు. "రాజశేఖర చరిత్రము" నవల చివర కృష్ణజగపతి మహారాజు చేసే ప్రబోధము, అది పంతులుగారు సమకాలీనులైన గృహస్థులకు చేసే ప్రబోధమే.

గోదావరిని వర్ణించిన సుదీర్ఘమైన ఆ మొదటివాక్యంలో గోదావరీమూర్తికి ఆయన తీర్చి దిద్దినరూపంచూస్తే విశ్వనాథవారి 'కిన్నెరసాని' గీతాలు గుర్తుకువస్తాయి. "...తానడుగిడిన చోటులనెల్ల సస్యములకును ఫలవృక్షములకును జీవనములిచ్చివానిని ఫలప్రదములు గావించుచు తన చల్లదనము వ్యాపించినంత వరకు నిరుపార్శ్వములందు భూమినంతను పచ్చని లేబచ్చికతో నలంకరించి పశుగణంబులకు ఆహారంబుకల్పించుచు తన రాకవిని దూరమునుండిబయలుదేరి అడవిపండ్లును, నెమలికన్నులునువహించి పొంగి నానా ముఖముల దన్నుగానవచ్చు వరద, మంజీర, పిన్నగంగ మొదలగువారి నాదరించి లోగొనుచు అంతకంతకు తన గంభీరత గానుపింప నాథుని వెదకికొనుచు వచ్చి వచ్చి...గోదావరి రసోత్తరంగముగా ఘోషించుచు పాదమునంబడి (ధవళగిరి) శిఖరంబున నధివసించు జనార్దనస్వామి దర్శనము చేసికొని, తోడనే అచ్చటనుండి తన శాఖారూపములైన రెండు చేతులను చాచి సరసతమీర నాథునిం గలియు భాగ్యము గాంచెను..."

"కడలి తనపై వలపు కమ్ముకొనివచ్చె"నని అడిలి పోయిన కిన్నెరవాగునకు "గోదావరి తానభయమిచ్చినది, గోదావరి కెరటాలు చాచినది, గోదావరి రమ్మన్నది కిన్నెరను"అంటూ గోదావరి కిన్నెరను 'ఆదరించి లోగొన్న' వైనాన్ని వర్ణించిన విశ్వనాథ పాటల్లో, ఆ కమనీయమైన కల్పన వీరేశలింగంగారిపై వర్ణన నుంచే వచ్చిందా ? అనిపిస్తుంది !

బ్రహ్మసమాజమువారికి విగ్రహారాధనముపై గౌరవము లేదు. కాని వీరేశలింగం గారు జనార్ధనస్వామి ఆలయాన్ని వర్ణిస్తూ, ఆ ప్రాకారములోపల ఉత్తరాన నున్న చిన్న గుహలో గల రాతి విగ్రహం ప్రసక్తితెచ్చి, జనార్దనస్వామి కళ్యాణోత్సవం ముగిసిన తర్వాత మళ్ళీ ఏడాదివరకు ఆ గుహవైపు ఎవరూ వెళ్ళరని తెలియజేస్తూ యిలా అంటారు.

'ఈ ప్రకారముగా మనుష్యులు భక్తిహీనులయి దేవతాసందర్శనముచేసి కొనక పోయినను, పర్వతమును కనిపెట్టుకొనియున్న చిన్న చతుష్పాద జంతువులుమాత్రము మిక్కిలి భక్తికతమై నిత్యము నా స్వామిని సందర్శించుకొనుచు ఉత్సవ దినములలో మనుష్యులువచ్చి తమ్ము తరిమివేయునంతటి పాపముం గట్టుకొన్న దాక రాత్రులు దేవతా సన్నిధానమున గుహలో వట్టి ఘాతంమునసే శయనించుచుండును'.

దీన్ని కేవలం కవి ఉత్ప్రేక్షగా కొట్టి పారేద్దామా ? కాదు. వీరేశలింగంగారి ఆర్ద్రహృదయమూ, ఆస్తికతా గాంభీర్యమూ యిక్కడ వ్యక్తమౌతున్నవి. అవే ఆయన గొప్పదనానికి గీటురాళ్ళు.

ధవళేశ్వరము, గోదావరియొడ్డు, సూర్యోదయ కాలము. పంతులుగారు కథానాయకుడు రాజశేఖరుణ్ణి ప్రవేశపెట్టిన అతనితోబాటు గ్రామంలోని వైజ్ఞానిక వ్యవస్థలో కీలకమైనపాత్ర సిద్ధాంతిసీ ప్రవేశపెట్టారు. వీరి మధ్య రామశాస్త్రి ఒకడు బ్రాహ్మణ్యానికి ప్రతినిధిగా, అంటే బ్రాహ్మణ్యానికి రాజశేఖరుడికీ గల సంబంధాన్ని వివరించే" పాత్రగా మనకు పరిచయం అవుతాడు. రామశాస్త్రి రాజశేఖరుణ్ణిగూర్చి అంటాడు. "వారీ గ్రామమున నుండబట్టి మనమందరము వారి యందను నిలువ గలిగినాము". ఆ నాటి క్షీణ జమీందారీ వ్యవస్థలో మాన్యములు గలిగిన రాజశేఖరుడు వంటివారు తప్ప మిగతా బ్రాహ్మణులకు సవ్యమైన జీవనోపాధిలేదు. సిద్ధాంతివలె జ్యోతిషమో, కామావధానులవలె విభూతివైద్యమో, మంత్రతంత్రాలో, నంబి రాఘవాచార్యునివలె అర్చకత్వమో ఆశ్రయించకపోతే మార్గములేదు. అవి నిర్వహించే చదువూ, తెలివీ లేకపోతే వంటచెయ్యడమే ఉపాధి. రాజశేఖరుని బాపమరది దామోద రయ్య ఘాతవైద్యంలో కొంత పేరూ ధనమూ సంపాదించిన తర్వాత గ్రామస్థులమీద అధికారం నెరపబోయి, తానుతీసుకున్న గోతిలోతనేపడి, అంతమొందుతాడు. వంట బ్రాహ్మణుడైన నేతిరామయ్య కంచుచెంబుల జోడు దొంగిలించి ముండకివ్వడంతో ఉపాధి పోగొట్టుకొని, 'మరి ఎందునకు పనికిరానివాడవుట చేత చదువులబడి పెట్టుకొని జీవనము చేస్తాడు'. (13 వ ప్రకరణము) బ్రతకలేకపోతే బడిపంతులు ఊరిలోని వైద్యుడు చనిపోగానే, ఆ రామయ్యే వైద్యంకూడా ప్రారంభించి, "ఘనవైద్యుడు"గా పేరొందుతాడు ! ఈ మార్గాలేవీ పీలుకాకపోతే, తుదకు మిగిలింది శవవాహకత్వం. 'ఆంధ్రదేశపు బ్రాహ్మణులలో ముఖ్యముగా స్మార్తులలో నెవరి యింటనైన ఎవరైన మృతినంది నప్పుడు బంధువులును, కులమువారును, తక్కిన మతములయందువలె

తమంతట వచ్చిసాయము చేయుటలేకపోగా, వచ్చి ప్రార్థించినను రాక సాకులుచెప్పుటయు, మొగము చాటువేయుటయు బ్రాహ్మణజాతి కంతయు "అవమానకరముగా నున్నది"అని విమర్శించారు పంతులుగారు. (7 వ ప్రకరణము) అందువల్ల పీనుగుల విస్సన్నవంటివారి కది ఉద్యోగమైనది.

నవయుగ వైతాళికుడుగా వీరేశలింగంగారు ఆ మేధావి వర్గాన్ని వైజ్ఞానికంగా, సాంస్కృతికంగా పునరుజ్జీవింపజేసే కార్యాన్ని చేపట్టారు. మత వ్యవస్థను చిత్రించ డంలో పంతులుగారు దేవతలను, విగ్రహారాధనను, ఉత్సవాలను విమర్శించలేదు. మత వ్యవస్థను అంటిపెట్టుకున్న వ్యక్తుల ధోరణుల్నే విమర్శించారు. వైష్ణవులలో 'ఒకరు తెంగలెవారును, ఒకరు వడగలెవారును గనుక, నామముక్రింద పాదముంచ వచ్చును కూడదని మాట పట్టింపులు పట్టుకోవడం' అదే సిగపట్లదాకా వెళ్ళడం ఒక సంగతి. (2 వ. ప్ర.) ఒకవైష్ణవుడు రాజశేఖరునితో యిలా చెబుతాడు :' ఆయన తాతయు, మా తాతయు సహోదరులు. ... ఈ గ్రామములోనివారు మావాని వంతుకును, ధవళేశ్వరములోని వారు నావంతునకును వచ్చినారు. సంవత్సరమున కొకసారి శిష్యసంచారము చేయుదుము...శిష్యుల కుపదేశించుట కేమిచదువు రావలెను ? శిష్యుల కష్టాక్షరి చెవిలో నుపదేశించి నిత్యమును నష్టోత్తర శతము జపము చేసికొమ్మని చెప్పి, గురువే దైవమని నమ్మికొలిచిన వైకుంఠము కరస్థమని పలికి, భుజముల మీద తప్తముద్రధారణము చేసి, మా గురుదక్షిణ పుచ్చుకొని మా దారిన మేము పోదుము. మే మెవ్వరితో ప్రసంగించము కనుక మమ్మందరును పండితులే యను కొందురు'. (13 వ ప్రకరణము) పోతే శ్రీ శంకరాచార్యులవారిరాక దేవుని ఉత్సవము కంటె ఆడంబరముగా నుండును. 'వారు పూర్వాశ్రమమునందు సహితము స్త్రీవిద్యోపాసకులే...ఆది సత్యమౌనో కాదో కాని వారిప్పుడును రాత్రిలు చీకటిలో ముసుగు వేసికొని ఒక మనుష్యుని వెంటబెట్టుకొని ప్రత్యక్షమయిన స్త్రీఉపాసన చేయుటకే బయలు దేరుచుందురు...' (14 వ ప్రకరణము) 'ఈ స్వాములవారే...భిక్షకు వెళ్ళినయింటి యజమానుని భార్యతో నేమో సరసమాడుచుండగా మగడువిని సన్యాసినేమైనా అన్న అపరాధమని యూరకుండి భిక్షానంతరం దక్షిణ యియ్యకబోగా అతనిని మూడు మాసములు వెలివేసి యేబదిరూపాయలు పుచ్చుకొని ప్రాయశ్చిత్తము చేయించి తరువాత మతములో కలుపుకొన్నాడు' (15 వ ప్రకరణము)

వ్యవస్థలో స్త్రీల పరిస్థితిని దిఙ్మాత్రముగా తేటతెల్లము చేసిన చిత్రణ రెండవ ప్రకరణములో నీలాటిరేవు సన్నివేశము. సంపన్నుడైన రాజశేఖరుని కుమార్తె

6) 

రుక్మిణి మొదలు గ్రామ స్త్రీలందరికి సమావేశస్థలమైన నీలాటిరేవు దృశ్యమును మొదట వర్ణించి తర్వాత వారి మధ్య జరుగు సంభాషణల కత్తిరింపులను జతపూర్చి నిర్మించిన ఈ రచన పంతులుగారి ప్రతిభకు నికషోపలము. ఇక్కడ సిద్ధాంతి భార్య బాలవితంతువైన చిన్న కూతురు రుగ్మతను గూర్చి చెబుతుంది. చనిపోయిన మగడు దయ్యమై వేధిస్తున్నాడని వాళ్ళనమ్మిక. జాతకములను గూర్చి తెలిసిన సిద్ధాంతి కొమార్తెకే ఈగతిఏమని ? రుక్మిణి ప్రశ్న. జ్యోతిషమునకు పార్వతి శాపమున్నదని. ఒక్కొక్కరి తలవ్రాత యని సమాధానము. ఆలు మగల పోట్లాటను గూర్చి కుతూహలముతో చెప్పుకొనుట. "మగడెలాగునున్నను దోషము లేదు. ఆడుదాని గుణము తిన్నగా నుండ నక్కరలేదా ?" అని ఒకముత్తైదువ వెలిబుచ్చిన అభిప్రాయము. అది నాటి సర్వజనాభిప్రాయము. అత్తగారు పెట్టు కోడంట్రికము, ఆడబిడ్డ పోరు. ఇంతలో ఒక ముసలావిడ తనమీద మయిలనీళ్ళు పడినవని పడుచువాళ్ళను కోప్పడుట, ఒకర్తె కొత్తగా చేయించుకున్న నగల ప్రదర్శనము. లేనివారిలో అసంతృప్తి ఇన్ని రకాల సంభాషణలుతర్వాత నీళ్ళుముంచుకుని వీరందరు మెట్లెక్కి తిరిగి వెడుతూండగా వినబడే ముక్తాయింపులు——"పూజారి పాపమ్మ చెంపకొప్పు పెట్టుచున్నది" "కరణము పెండ్లామెంత ఒయ్యారముగా నడచునో చూచినావా !,, ,,పుల్లమ్మ పట్టపగలే మగనితో మాట్లాడునట', ,,కన్నమ్మది కొంచెము మెల్లకన్ను సుమా!,, కరణంగారి సీతమ్మకు నగలే లేవే,,.

అయిదవ ప్రకరణములో రథోత్సవము వర్ణన, రుక్మిణి వర్ణన ఎన్నదగినవి. (౬౩ పుట)చివర రుక్మిణి మెడలోని కాసుల పేరును ఎవడోదొంగ పుటుక్కున త్రెంచుటతో ఆ ప్రకరణం ముగుస్తుంది. పోయిన వస్తువుకై అన్వేషణ ప్రారంభమైన ఆరవ ప్రకరణంలో రాజశేఖరుని కుటుంబానికి కష్టాల పరంపర కూడా ప్రారంభమవుతుంది. అందులో రుక్మిణి భర్త పోయాడన్న వార్త, రుక్మిణి అస్వస్థత, వైద్యము, చివరకు హరిశాస్త్రి జరిపిన తంతు, ఆనాటి విగత భర్తృకలకు సామాన్యంగా వచ్చే మానసిక రుగ్మత తత్వాన్ని తెలియ జేస్తున్నవి. సిద్ధాంతిగారి వితంతు కుమార్తెకూ భర్తమరణవార్త విన్న తర్వాత రుక్మిణికీ ఒకే విధమైన రుగ్మత రావడంలో సామూహికంగాఉండే మూఢనమ్మకాలు వ్యక్తులమీద ఎలా ప్రభావాన్ని చూపుతవో పంతులు గారు చూపించారు.

కాని వీటిని మూఢనమ్మకాలు అనడంకంటె మూఢభయాలు అనడం సముచితంగా ఉంటుందని తోస్తుంది. నమ్మకం శక్తినిస్తుంది. భయం శక్తినిహరిస్తుంది. వ్యవస్థల

శిధిలావస్థలో విజ్ఞానం విశ్వాసం బదులు అవిశ్వాసాన్నీ, భయాన్నీ, దైన్యాన్నీ పెంపొందిస్తుంది. దాన్ని జయించడానికి గట్టి హేతు వివేచన అవసరం. అలాంటి విచారణనూ, విచక్షణనూ పురికొల్పడానికే వీరేశలింగంగారు "రాజశేఖర చరిత్రము" వంటి రచనలు చేశారు. రంగంలోకి దిగారు. విజయం పొందారు

రాజశేఖరచరిత్రములో రాజశేఖరునికుటుంబాన్ని ఆదుకున్న రామరాజునేచిట్టచివర కృష్ణజగపతి మహారాజుగా ఆవిష్కరింప జేయడం నవలలో ఏదో అద్భుతాన్ని ప్రవేశ పెట్టక తీరదు అనే భావంతో పంతులుగారు చేసిన కల్పనగా తోస్తుంది. ఇది వాస్తవి కతను ఆధారం చేసుకున్న నవలలలో లోపమనే చెప్పాలి.

సత్యవతీ చరిత్రము పూర్తిగా స్త్రీల దుఃఖస్థితిని చిత్రించుటకై ఉద్దేశించిన నవల స్త్రీ జనోద్ధరణం విషయంలో స్త్రీ వ్యక్తిగా చేయవలసిన స్వప్రయత్నాల్ని గూర్చి ప్రబోధించేందుకే సత్యవతి పాత్రను తీర్చిదిద్దారు పంతులుగారు. అందులో మొదటిది స్త్రీలు విద్యావతులగుట. ఆనాడు స్త్రీలకు విద్య పూర్తిగా నిషిద్ధము. వేశ్యలు మాత్రమే వారి వృత్తికి అవసరమైన సంగీత, సాహిత్యేతర కళల్ని అభ్యసించే వారు. రాజ శేఖరుడు వంటి సంపన్నగృహస్థుడు స్వయంగా చదువుకున్నవాడు, కొమార్తెకు చదువు చెప్పిస్తే, సమయం వచ్చినపుడు నలుగురూ కలిసి ఆయన్నికూడా నిలదీసే వారు. సత్యవతి విద్యావతి భర్తనారాయణమూర్తి శ్రద్ధగా చదివి ప్రభుత్వఉద్యోగాన్ని సంపాయించి తర్వాత న్యాయవాద వృత్తిని అవలంబించి అవిభక్త కుటుంబం బాధ్యతల్ని వహిస్తాడు. అవిభక్త కుటుంబం అంటే ముగ్గురు అన్నదమ్ములు, వారి భార్యలు, వితంతువైన అక్క, చెల్లెలూ ఆమె భర్తా. పంతులుగారు నవల చివర తన ఉద్దేశాన్ని యిలా వివరిస్తారు :— దంపతులిద్దరికీ చదువు రాకపోతే ఏదోవిధంగా కుదురుతుంది. యిద్దరికీ చదువు వచ్చినట్లయితే వారి సంసారం సుఖమయమౌతుంది. లోకానికి మేలు జరుగుతుంది. భర్తకు చదువురాక భార్య విద్యావతి అయితే ఆమె ఎన్ని కడగండ్లు అనుభవించినా, ఏదో సమయంలో భర్తను సరిదిద్దుకో గలుగుతుంది. కాని భర్త విద్యా వంతుడై భార్య చదువురాని గయ్యాళి అయితే వారికి ఎప్పుడూ సుఖంలభించదు. ఈ నాలుగు రకాల దాంపత్యాలనూ నవలలో ప్రదర్శించడంలో పంతులు గారు స్త్రీకి విద్య తప్పనిసరి అని నిరూపించే ప్రయత్నం చేశాడు.

పంతులుగారి రచనల ద్వారా అన్నిటి కంటె బాగా స్పష్టమౌతున్న విషయం నాటి స్త్రీల దుస్థితి. అతి బాల్యంలోనే వివాహం చేసేవారు. ఈడు కుదిరిన పిన్నవయ

స్కునితో వివాహం జరిగినా రజస్వల కాగానే కాపురానికి వెళ్ళటం, గర్భవతి కావడం ప్రసూతి సమయంలోనో, తదుపరి ప్రసూతి కాలంలో జరిగిన అశ్రద్ధ మూలంగావచ్చిన జబ్బులు, బలహీనతలు వల్లనో ఆమె మరణించేది. భార్యమరణించగానే రెండు, మూడు, నాలుగు పెళ్ళిళ్ళు పండు ముసలితనందాకా కూడా పురుషుడు చేసుకుంటూనే ఉండేవాడు ప్రతి పర్యాయము ఎనిమిదేళ్ళలోపు కన్యనే చేసుకోవడం జరిగేది. చివరకు ఒక బాల వితంతువు మిగిలేది. అటు పైని ఆమె జీవితం అవిభక్త కుటుంబంలో పుట్టింటిలోనో అత్తింటిలోనో ఎన్నో కట్టు బాట్లకూ, అవమానాలకూ లోబడి సాగేది. ఇలా అకాల మరణాన్నీ, అకాల వైధవ్యాన్నీ తప్పించుకున్న స్త్రీలు వుంటే, వారు విద్యాగంధంలేక, సంస్కార విహీనలై, బానిసలుగానో, లేక అలవిమీరిన గయ్యాళులుగానో కుటుంబజీవితంలో నరకాన్ని అనుభవిస్తూ యితరుల్ని అనుభవింప జేస్తూ బ్రతికేవారు. ఈ పరిస్థితిని మనం అవగాహన చేసుకుంటే పంతులుగారు సంస్కర్తగా స్త్రీ జనోద్ధరణకూ, సమాజ పునరుజ్జీవనానికి ఎంత గొప్పసేవ చేశారో బోధపడుతుంది.

సత్యవతీ చరిత్రము, కోడింత్రికం ఎలా ఉంటుందో ఒక సన్నివేశంలో ప్రారంభమౌతుంది. పట్టణంలో చదువుకుంటున్న సత్యవతి భర్త సెలవులకు యింటికి వచ్చాడు. కాని భార్యాభర్తలు మాట్లాడుకోవడానికివీల్లేదు. రాత్రి పడకటింటిలో కలుసుకోవాలి. కోడలి ఉత్సాహాన్ని కనిపెట్టిన అత్త నిద్రపోకుండా ఏకులబుట్ట ముందు వేసుకుని వత్తులు చేస్తూ దీపంముందర కూర్చుంటుంది చాలాసేపటికి సత్యవతి మంచినీళ్ళ చెంబుతో కాళ్ల చప్పుడుకానీక భయపడుచు మెల్లగా గోడయోరనుండి నడచి పడక గదిలో ప్రవేశించెను. అది ఓరకంట చూచి తలపంకించి చివాలున లేచిపోయి తన గది తలుపు వేసికొనెను. సత్యవతి అత్త మాటకు ఎదురాడకుండా గడుపు కుంటూ వస్తుంది. కాని పెద్దకోడలు సుందరమ్మ మాటకుమాట జవాబిచ్చి ఎడతెగని కలహాన్ని రేపి యిల్లు నరకం చేస్తూ ఉంటుంది. వీరిద్దర్నీ అలక తీర్చి, అన్నంపెట్టి సర్దుకు వచ్చే బాధ్యత సత్యవతి వహిస్తుంది. మనవడ్నికాక మనవరాలిని కన్నదని అత్తపెద్ద కోడల్ని తిడితే, ఆడది పుడితే నేను ఏంచేస్తాను ? కావలిస్తే మీ కొడుకు లోపంగాని నాలోపం ఏమిలేదు. అని బదులు చెబుతుంది కోడలు. రెండోకాన్పు మగ బిడ్డ జన్మించినా ప్రసూతి కాలంలో మూఢాచారాలవల్ల అత్తాకోడళ్లు ఆ బిడ్డను బ్రతికించు కోలేకపోతారు. బాలింతరాళ్లకు గాలి బొత్తిగా పనికిరాదు. పురిటిల్లు ఎప్పుడూచీకటి కోణంగా ఉండవలెను. తలుపు తీసి కొంచెము వెలుతురు రానిస్తే ఎన్నెమ్మవచ్చి శిశువు గొంతునొక్కివేస్తుంది.'' అంతేకాదు, బాలెంతకు మూడురోజులుదాకా ఆహారమూ

నేస్లా నిషిద్ధం. తలుపులూ కిటికీలు మూసినగదిలో వెల్లుల్లిపాయల కంపూ, కుంపటి పొగా తప్పనిసరి. చావడి గుమ్మంవద్ద పాతచెప్పు, కలబంద మట్ట, భూతులని చెట్టొకటి మీద దూలానికి వ్రేలాడగట్ట పలెను. ఈ పరిస్థితుల్లో బాలెంతకు ఊపిరా డకపోయినా, దాహంవేసినా, ఏవో జబ్బు పేరుతో వైద్యుడిచ్చే ఔషధాలేగతి ! పెరటి తలుపుతీసిపెట్టి, మంచినీళ్లిచ్చి, తోటికోడలు సత్యవతి చేసిన ఉపకారాన్ని సుందరమ్మ అందుమూలంగా ఎన్నెమ్మ ప్రవేశించి బిడ్డనుచంపివేసిందనీ మూఢనమ్మకం వల్ల, అప కారంగానే భావిస్తుంది !

అయిదో ప్రకరణంలో అత్తా కోడళ్ల సంవాదాన్నీ కలహాన్నీ సహజంగా చిత్రిం చారు పంతులుగారు. అలాంటి చోట అయన వ్యావహారిక భాషనే ఉపయోగిస్తారు. మూఢురాండ్రగుటచే మన స్త్రీలు ఎదురుతిరిగినవారి జోలికి పోక తమకు లోబడి లోకువగా కనబడువారి మీదనే అందరిమీది కోపము కనబరుతురు గనుక అత్తగారివలన సత్యవతికి కలుగు బాధ యింతయని చెప్పనలవి కాదు. ఈ కథలో పెద్దకోడలు సుందరమ్మ వేరు కాపురం పెట్టిస్తుంది భర్తచేత. ఆమె మామగారు కాశీ యాత్రకై లేచి పోతారు. సత్యవతి అత్తగారితో బాటు మరదుల్నీ, ఆడబిడ్డనూ ఆమె భర్తనూ అతని తల్లినీ అందర్నీ ఆదరిస్తుంది. కాని చివరకు అత్తగారు ఒకసారి పెద్దకోడలి దగ్గరకే వెళ్లిపోతుంది. సత్యవతి చతుర్తా, సహనమూ, సంస్కారమూ అత్తగారితో బాటు అందరికీ కొత్తగా ఉంది. అవగాహన కాని విషయం. మాటకుమాట అంటూ పోట్లాడుకునే వ్యక్తులకు తమవంటివారి సాహచర్యం లేకపోతే దిక్కుతోచదు అనేవిష యము పంతులుగారు చక్కగా చిత్రించారు.

పంతులుగారి 'సత్యరాజా పూర్వదేశ యాత్రలు' రెండోభాగం, 'లంకాద్వీపచ ర్యలు' ప్రధానంగా జ్యోతిషశాస్త్రం మీదగల నమ్మకాన్ని ఖండించేందుకేవారుఉపయోగిం చారు. సత్యరాజాపూర్వదేశయాత్రలు మొదటి భాగం, ఆడుమళయాళం మన సమాజంలో స్త్రీలదుఃఖస్థితిని వ్యంగ్యంగానూ, అన్యాపదేశంగానూ, అంటే పురుషులకు ఆరోపించి చిత్రించే ప్రయత్నం. ఈ మొదటిభాగం నవల పరిధిలోకే వస్తుందని చెప్పాలి. ఆంగ్లవచన రచయిత స్విఫ్ట్ "గలివర్స్ ట్రావెల్స్"ని అనుసరించిన ఈ రచ నలో విమర్శనా పూర్వకమైన హాస్యం ప్రధానం. వ్యంగ్య రచన కాబట్టి వాస్తవికత ప్రధానం కాదు. కాని మొదటి రెండు ప్రకరణలూ, అందే సత్యరాజా చాద్యులు ఆడుమళయాళం చేరేదాకా జరిగిన కథా కథనంలో, పంతులుగారు నాటి స్థితిగతుల్ని

హాస్యస్ఫోరకంగా, చిత్రించారు. ఈ భాగంలో మనకు మొక్కపాటివారి బారిష్టరు పార్వతీశం గుర్తుకువస్తాడు. విజయనగర వాస్తవ్యుడైన సత్యరాజాచార్యులు విశాఖ వచ్చి ధూమనౌక మీద చెన్నపురికి ప్రయాణం చేస్తాడు. ఓడ ప్రయాణం మూడు రోజులు. ప్రయాణంలో అన్నహితవు లేక ఉపవాసం చేస్తాడు. ఓడరేవు దగ్గర గుర్రపుబండి వాని అరవ—తెలుగు యిలా వుంటుంది:"దుడ్డు తీసి అన్నంవేసే యింటికి నిన్ను ఎత్తుకు పోయి విడువ వలెనా ? ముక్కాలు రూపాయి, ఉక్కారుంగో" అని వాడంటే, "ముక్కాలురూపాయీ కాక యింకొ ఉక్కారుంగో ఏమిటి ? వేరం పిన్నగా చెప్పు" అంటాడు సత్యరాజాచార్యులు. బండివాడు సుబ్బరామ అయ్యర్ అన్నసత్రం అని బోర్డువున్న యింటికి తీసుకువెడతాడు. "సత్రం కాదు వంటపూటి యింటి,, కని సత్యరాజ బండి దిగడు. బండివాడు చేయి పట్టుకుని లాగి, మూటతీసి క్రిందపడ వేస్తాడు. ఆరోజుల్లో హోటళ్లకు సత్రాలని బోర్డులు వ్రాసేవారు కాబోలు ! ద్వాదశి పారణ చెయ్యాలనీ, ఎవరైనా బ్రాహ్మడికి భోజనం పెట్టాలనీ చెబుతాడు సత్యరాజా. వాకిట కూర్చున్న బ్రాహ్మణుడు వచ్చి పంక్తిలో కూర్చుంటాడు. కానివాడు అద్వైతి సత్యరాజా మధ్వ బ్రాహ్మణుడు. ద్వైతి విస్తరిముందు కూర్చున్నవాణ్ణి లేచిపొమ్మ న్నచో దోషము వచ్చునని యెంచి విష్ణుడనై ఊరకుంటిని,, అంటాడు సత్యరాజా. వంట బ్రాహ్మణుడు అన్నపు బిందె, పులుసుకుండ, వీరికి వడ్డించినతర్వాత వాకిటిలోకి పోయి శూద్రులకు వడ్డించి తీసుకవస్తాడు. శూద్రులు చూసిన అన్నము తినుటకు మనసొప్పక సత్యరాజా మారువడ్డించుకోడు. తర్వాత పంక్తిని కూర్చున్న ఆ బ్రాహ్మ ణునితో మాటలు కలిపి సత్యరాజా అతణ్ణి తోడువమ్మని దక్షిణదేశ యాత్రప్రారంభి స్తాడు. రైల్లో తన మూటను ఆబ్రాహ్మణునికిస్తాడు. మధురలో తెల్లవారుజామున బాహ్యమునకు పోవుటకయి యిద్దరూ రైలుదిగుతారు. తర్వాత ఆ బ్రాహ్మణుడు సత్యరాజాకు కనిపించడు. తెచ్చిన ధనము అలా పోగొట్టుకుంటాడు సత్యరాజా.

"ఆడుమళయాళం" లో స్త్రీ పురుషుల స్థానాన్ని వ్యత్యస్తం చెయ్యడం ద్వారా మన సమాజంలో నాడు స్త్రీల దుఃస్థితినీ, కట్టు బానిసత్వాన్నీ పురుషులకు అవగాహన అయ్యేలా సుబోధకం చేశారు పంతులుగారు. తనదాకా వస్తేగాని తెలియదు. అట్లు స్త్రీలు సర్వాధికారిణులైన సమాజంలో పురుషుడిస్థానాన్ని ఊహించుకొమ్మని, స్త్రీపురుష లిద్దరికీ మన సమాజ పరిస్థితులు అర్థమయ్యేలా సాగింది ఈ రచన, స్త్రీలు బలహీను రాండ్రగుటయే దేవుడు వారు పనిపాటలు చేయనక్కరలేక సుఖముగా కూర్చుండి ఆలోచన చేయుచు ప్రభుత్వము చేయవలయునని ఉద్దేశించె ననుటకు నీకు నిదర్శన

ముగా కనబడుచుండలేదా ?... స్త్రీలు బుద్ధిబలము గలవారు. దేహ బలమెంత యున్నను బుద్ధి బలమునకు చాలదు. అందుచేతనే పురుషులు స్త్రీలకు లోబడుట సంభవించినది... అని వాదిస్తుంది ఆడుమళయాళ దేశంలో సత్యరాజావారి యజమానురాలు. "అది సత్యము ఆ శక్తి స్త్రీల వద్ద తప్పక ఉన్నది. సర్వ స్వతంత్రులమని చెప్పుకొనుచున్న మా దేశమునందు సహితము పురుషులు స్త్రీలకు దాసులయి వారు చెప్పినట్లే నడచుచున్నారు. సంస్కారకర్తలమని...సభలలో పులులవలెనరచెడు మా దేశమునందలి నవనాగరిక పురుషులు కూడ ఇంటివద్ద భార్యలముందు నోరెత్త లేక పిల్లులవలె నొదిగియుండి భార్యలు చెప్పినట్లే తాము నడచుకొనుచున్నారు." ఇలా పంతులుగారి కత్తికి రెండువైపులా పదునున్నట్లు కనిపిస్తుంది. ఈ రచనలో అటు స్త్రీలకు ప్రోత్సాహము, యిటు పురుషులకు ఎత్తిపొడుపూ. సంఘసంస్కరణ స్త్రీలలో చైతన్యం కలిగి మార్పువస్తేతప్ప ఫలప్రదంకాదని, క్రమంగా స్త్రీలవైపే తన దృష్టిని సారించారు పంతులుగారు. "ఆడుమళయాళం" హాస్యమూ చురుకైన వ్యంగ్యమూ మేళవించిన రచన. తప్పకుండా నవలా ప్రక్రియకు చెందినదే ! ఇందులోని యుక్తి ప్రత్యుక్తులు. ఉపన్యాస ధోరణులు, తర్వాతికాలంలో 'సాక్షి' ఉపన్యాసాలకు వరవడి పెట్టినవనుటలో సందేహములేదు !

వీరేశలింగంగారి ప్రభావం నవలా రచయితగా చిలకమర్తి, వేంకటపార్వతీశ్వరులు, విశ్వనాథ, మొక్కపాటి, పానుగంటి గార్లపై ఉన్నదనడంలో సందేహంలేదు. సాహిత్యానికి సంస్కరణోద్యమ రూపం యిచ్చిన ఘనత పంతులుగారిది. గురజాడ వారిని అభ్యుదయవాదులు గురువుగా స్వీకరించినా, ఆ స్థానం నిజంగా వీరేశలింగం గారిదే ! గురజాడవారు సాహిత్యతపస్వి. 'కన్యాశుల్కం' సంస్కరణోద్దేశంతో వ్రాయబడినా, అందులో మిగిలిన సంస్కరణ భావాలు చాల తక్కువ ! అందులోని వ్యక్తులు మానవతా వాదానికీ, మౌలికమైన మానవనైజ నిరూపణకూ చేరువలో ఉంటారు. కాని ఆయన కారుణ్యం, ప్రేమార్ద్ర హృదయం, సమాజ పునరుజ్జీవ కాంక్ష, మనల్ని ఆకట్టుకుంటాయి. చలం, రంగనాయకమ్మ వంటివారు ఆయన్నే వరవడిగా గ్రహించారు. వీరేశలింగం సంధియుగంలో తెలుగువారికి మార్గంచూపి ఉద్ధరించిన మహావ్యక్తి. సాహిత్య పరిణామంలోనూ సమాజపరిణామంలోనూ తెలుగువారికి ఆయన చిరస్మరణీయుడు.

# వీరేశలింగం గారి ప్రహసనాలు
## సమకాలీన సామాజిక ప్రతిబింబాలు

ఆవంత్స సోమసుందర్

కందుకూరి వీరేశలింగం నిస్సంశయంగా యుగపురుషుడు. చిత్తశుద్ధితో, నిజాయతీతో, కార్యదీక్షతో, ఆత్మగౌరవంతో సంఘసంస్కరణ పతాక నెగురవేసిన ప్రథముడు. పూనుకొన్న ప్రతి కార్యాన్నీ విజయవంతం చేసిన మహనీయుడు. తెలుగుజాతి తరతరాలకూ క్రియాశీలిగా ఆదర్శపురుషుడు.

ఆధునిక సాహిత్య ప్రక్రియల కెన్నిటికో ఆయనే ఆద్యుడు. ఆయనే ఈ విషయం స్వీయచరిత్రలో ఉద్ఘాటించు కొన్నారు. ఆద్యత్వంపట్ల ఆయనకుగల విపరీతమైన మోజు విమర్శకు అతీతంగాదు.

నవలా సాహిత్యానికి రాజశేఖర చరిత్ర ఆదిగ్రంథం కాదని ఇదివరకే తేలిపోయింది. అలాగే నాటక రచన విషయంలోనూను. వావిలాల వాసుదేవశాస్త్రి తనకు సన్నిహితులే ! ఆయన ఏనాడో మౌలిక నాటకాలనూ, షేక్స్పియర్ అనువాదాలనూ రచించి ఉండగా, స్వీయచరిత్రలోమళ్ళీ తన ఆద్యత్వాన్ని స్థాపించుకో చూడటం వెర్రితనం. పైగా ఉత్తరరామ చరిత్ర ఆంధ్రీకరణం ప్రచురిస్తూ వావిలాల వాసుదేవ శాస్త్రి తన గురువగు కోరాడ రామచంద్రశాస్త్రి ప్రథమాంధ్ర నాటకకర్తలన్న సత్యాన్ని 1883లోనే స్థాపించుకున్నారు.

ఆద్యత్వం సర్వత్రా ఉత్తమత్వాన్ని ధ్రువపరచకో జాలదు. ఒక్కొక్కమారు ఆదిమత్వానికీ, ప్రాథమికత్వానికీ ప్రతీకమాత్రమైపోయే ప్రమాదమూ ఉంటుంది. వీరేశలింగం సాహిత్యంలో అ ప్రమాదం సంభవించకనూ పోలేదు ! ఆవిషయం ఉత్తరోత్తరా చర్చించుకుందాం

ప్రస్తుతానికి నా పరిశీలనకు నిలచిన ప్రహసనాలలో బ్రాహ్మవివాహం అనే పెద్దయ్యగారి పెండ్లి - తెలుగు ప్రహసన సాహిత్యానికీ ఆదిపీఠం. ఆ విషయం

నిస్సందేహమే ! అది క్రీ. శ. 1878 సం॥లో ప్రచురింప బడింది. దాన్ని గురించిన విపుల పరిశీలన కిప్పుడు అవకాశంలేదు.

## వ్యావహారిక భాషాప్రహసనానికి ఆద్యులు

ఆ కారణం వల్లనే వారిలా నిష్కర్ష చేశారు; మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని... గ్రంథములను సాధారణముగా సలక్షణమైన సులభశైలిని రచించ వలెన నియే నాయభిప్రాయమైనను విషయానుగుణముగా తత్తదుచిత రీతిని గ్రామ్యభాషయందు సహితము గ్రంథములను వ్రాయవచ్చునని కూడ నా యభిప్రాయము .. ఏ విషయమునను నేనితరులు చూపిన దారినే పోవువాడను గాక, మనసు తిరిగినప్పుడు నాదారినే నేను నడచు వాడనగుటచేత సులభవచన రచనా విషయమై ఇతరుల మాటలను పాటి చేయక, నా నూతన మార్గానుసారము సంభాషణ రూపమున "బ్రాహ్మవివాహమును వ్రాసి 'హాస్యసంజీవని' మొదటి పత్రికలో కొంతభాగము ప్రకటించితిని'' అంటూ కంఠోక్తిగా స్థాపించారు. తాము విశ్వసించిన రీతినే బ్రాహ్మ వివాహమును వ్యావహారిక భాషలో రచించారు.

ఈ విషయంలోనే వారింకో సత్యాన్నిచాటారు. "నీతిచంద్రికలోని విగ్రహమును సంధిని చేసిన తర్వాత నాకొకయాలోచనము కలిగెను. భాష వలని ప్రయోజన మేమి? జనులు తమ యభిప్రాయములు నొండొరులకు తెలుపుకొనుట; భాషలోని గ్రంథములు దూరమున నున్నవారికిని, రాబోవు తరముల వారికిని సులభముగా తెలుపుట. అట్టి సౌలభ్యము విగ్రహము వంటి పుస్తకము వలన కలుగునా ? కలగదు'' అంటూ నిస్సంకోచంగా విమర్శించుకొన్నారు.

విగ్రహాదులలోని పదాలు, వాక్యాలు సామాన్యుల కర్థం కావాలంటే పండితుల సాయంకోరక తప్పదని కూడా వీరేశలింగం గ్రహించారు. ఆ అవగాహన తోనే___ అందరికి తెలియునట్లు గ్రంథములు సులభముగ నుండవలెను అనేనిర్ణయానికి వచ్చారు సాహసోపేతంగా వ్యావహారిక భాషనుపయోగించి సంభాషణారీతిలో తొలిప్రహసనం మొదలుకొని నలభయ్యో, ఏబయ్యో ప్రహసనాలు రచించారు. చిన్నయసూరి వ్యాకరణాభియోగంతో శిష్టజన వ్యావహారికం గ్రామ్యంగా పేరుబడింది. ఆ దుష్ట ప్రభావంతోనే వీరేశలింగం కూడా కొట్టుకుపోయారు !

తంజావూరు నాయకరాజుల కాలంలో వెలసిన మన్నారు దాసవిలాసం వంటి యక్షగానాలలో వ్యావహారిక భాష ధారాళంగా ప్రయుక్త మవుతూనే వస్తోంది. సంస్కృత నాటకాలలో పాత్రోచిత సంభాషణార్థం నీచపాత్రలకు ప్రాకృతం, పైశాచీ మాగధి వంటి భాషలు పరిపాటిగా ఉపయుక్త మవడం యీ నాటిదికాదు. కాని తెలుగులో వైయాకరుణుల ఛాష్టికం గట్టి మేకుబందీ చేసి వేసింది. కాళిదాసు మహాకవి అభిజ్ఞాన శాకుంతలాన్ని నాటకంగా అనువాదించే ధైర్యంలేకనే పిల్లలమర్రి వీరన్న ప్రబంధంగా మలిచాడు. సరళ సుందర నాటకాన్ని జటిలీకరించాడు.

ఈ దుర్దశ అనుపూర్వికంగా సాగుతున్నదే ! కాని యక్షగాన కర్తలు యధాశక్తి ప్రతి ఘటిస్తూనే ఉన్నారు. స్వతంత్రిస్తూనే ఉన్నారు. కనుకనే తెలుగు సాహిత్యంలో యక్షగానం ఒక్కటే రూపక ప్రక్రియలన్నిటికి ప్రతినిధిగా 18 వ శతాబ్ది వరకూ నిలచింది. వీరేశలింగం బ్రాహ్మవివాహం రచించే వరకూ శిష్ట వ్యావహారిక భాషకు గ్రంథాదరణ లభించలేదు, సమకాలిక సజీవ సమాజానికి ప్రాతినిధ్యమూ లభించలేదు.

జాతి జనుల నాటకాలపై సదా తుళ్ళింతలాడే మధురమైన తెలుగు భాషను వీరేశలింగం 'గ్రామ్యమని' పిలిచినందుకు మనం తప్పుపట్ట నక్కరలేదు. శిష్టజన వ్యావహారికం అనేమాట ఆనాటికింకా స్థిరపడలేదు ! ఆ పని ఇరవయ్యో శతాబ్ది తొలిదశ కాలం నుంచీ జరుగుతూ వచ్చింది.

## జాతికి వివేక వర్ధని

వీరేశలింగం జీవితమే తెలుగుజాతికి వివేకవర్ధని. గతానుగతికంగా సాగిపోవడం మాని, ఆగి ఆలోచించ నారంభించిందాయన వల్లనే; 1876 జూలై ప్రారంభం నుంచి ఆయన వివేక వర్ధని పక్షపత్రికగా మార్చి నడపనారంభించారు. దాని కనుబంధంగా హాస్యసంజీవని అనే పేరుతో హాస్యరచనా ప్రధానమైన ఒక మాస పత్రికనూ ప్రారంభించారు.

దేశాభివృద్ధికి భంగకరంగా నిలచిన సమస్త పూర్వాచారాలనూ పూర్వపక్షం చేస్తూ, దేశాభివృద్ధి కరాలైనసూతనాచారాలను సిద్ధాంతం చేస్తూ వివేకవర్ధని పురోగమించింది. కొక్కొండ వెంకటరత్నం పంతులు కీపని దుస్సహమైంది. ఆయన

వీరేశలింగం అన్నట్లు—"పూర్వాచార స్థాపన దీక్షాదక్షులు; నిశాసి పత్రికా ధారులున్నూ !" ఇంక చెప్పవలసినదేముంది ? వీరేశలింగం ఉద్యమాన్ని ఖండించడానికీ, గేలీ చేయడానికీ తన సర్వశక్తులూ ఒడ్డాడు కొక్కొండ ! హాస్యవర్ధని అనే మాస పత్రిక స్థాపించాడు. దానికి ప్రతిఘటనా మాత్రంగా హాస్యసంజీవని స్థాపనకు వీరేశలింగానికి ప్రేరణ కలిగించాడు.

బ్రాహ్మ వివాహ ప్రహసనాన్ని ధారావాహికగా హాస్యసంజీవనిలో ప్రచురిస్తున్నపుడు ప్రజలెంతో "ఆసక్తితో అదరించారు. ఆ సందర్భంలో వీరేశలింగం యిలా వ్రాసుకున్నారు; అట్టి వ్రాతకదియే తెలుగుభాష యందు మొదలగుటచేత నా దినముల యందెక్కడ చూచినను మూకలుగట్టి జనులు హాస్యసంజీవనిని—ముఖ్యంగా నందలి బ్రాహ్మవివాహమును చదివి యానందించుచు వచ్చిరి. రెండేండ్లకు తరువాత నేనొక సారి బందరు పురమునకు పోయినపుడొక బ్రాహ్మణ బాలిక బ్రాహ్మవివాహమును మొదటినుండి తుదవరకును నప్పగించి నాకాశ్చర్యము కలిగించెను." అని వివరించారు.

నిజమే; ఒక నాటకాన్ని కంఠతా పట్టి అప్పగించడం అప్పటికీ కాదు, ఇప్పటికీ ఆశ్చర్యమే! ఆధునిక నాటక ప్రదర్శనల్లో నేటికీ అనేక పాత్రధారులు తమ పోర్షన్లు కంఠతారాక, ప్రామిటింగు కోసం సైడు వింగుల్లోకి తెల్లబోయి చూస్తూండటం నిత్యం జరుగు తున్నదే !

అంతస్ఫూర్తి కలగడం వల్లనే వీరేశలింగం తెలుగులో అసంఖ్యాక ప్రహసనాలు రచించగలిగారు. సంఘంలోని సకలకాలుష్యాలనూ కడిగివేయాలన్న స్థిరసంకల్పంతోనే హాస్యరసస్ఫోరకంగా, వ్యంగ్యధోరణిలో సంఘదురాచారాలను విమర్శించ డానికీ ప్రహసనం ఒకనిశితాయుధమని వారు విశ్వసించారు,

హేళనాత్మకంగా నిశిత విమర్శలు చేయడంలో ఆయన నేర్పు అదినుంచీ వెల్లడి అవుతూనే వుంది. కొక్కొండ రచించిన విగ్రహాన్ని విమర్శించి తుత్తునియ లొనర్చినపుడే ఆ కౌశలం ప్రకటిత మైంది. శత్రుపక్షంలో నిలచి కొక్కొండ ఎన్నోరీతులుగా వీరేశలింగం ప్రతిభావిష్కారానికి ప్రేరకులయ్యారు. రామునితో పాటు రావణుడున్నూ చిరంజీవే !

తక్షణావసర ప్రేరణతోనే వీరేశలింగం ప్రతిప్రహసనమూ రచించారు. ఆనాటి సాహిత్య స్థితిని పరిశీలిస్తే ప్రహసనమొక అపూర్వ సృజనే! పైగా అది ప్రజలకు

సద్యః స్ఫూర్తితో ఉత్సాహం కలిగించగల ప్రక్రియ ! కాని అసంఖ్యాక కావ్యక్రమ బాధ్యతా భారాల వల్ల శిల్పవంతంగా తీర్చి దిద్దుకోగలిగినంత వ్యవధి వీరేశలింగానికి లభించ లేదు. అప్పటికే ఆయన కొన్ని ముఖ్యప్రహసనాలకు రచనా ప్రణాళిక రూపొందించు కోవడంలోనూ, సంభాషణను నైపుణ్యంగా చిత్రించడంలోనూ, రంగ విభజన చేయడంలోనూ, అప్పటికెంతో కౌశలం ప్రదర్శించారనే చెప్పాలి. వారికి ఉదాహరణ మాత్రంగా నిలవడానికి తెలుగులో ఒక్క రచన కూడా లేకపోయినా ఆంగ్ల సాహిత్యం లోని Farce, Drama, Play వంటి విభిన్నరూపక ప్రక్రియలెంతో ప్రేరకమై ఉంటాయి.

Farce = a Dramatic work merely to excite laugter, Thir species of drama absurdly furtile proceeding, mockery అంటూ ఆక్స్‌ఫర్డ్ నిఘంటుకారుడు, అయోగ్య ప్రక్రియగా నిర్వచించాడు. ఫార్సుకు సమానార్థకంగా ప్రహసనం అని తెలుగులో పేరుపెట్టి వీరేశలింగం దానిని సంఘసంస్కరణార్థం నిశితాయుధంగా ప్రయోగించాడు.

## అపూర్వ సాహిత్య సృష్టి

వీరేశలింగం తొలి ప్రహసనాలైన బ్రాహ్మవివాహం, వ్యవహార ధర్మబోధిని వంటివి ఆనాటి సాహిత్య చరిత్రకే అపూర్వ సృజనలు ! పైగా ఎంతో నైపుణ్యం ప్రదర్శించడం వల్ల బహు జనాకర్షకాలయ్యాయి. ఆయన రచించిన సర్వప్రహసనాలకూ రాజమండ్రిలో తన ఎట్టఎదుట నిలచిన సామాజికుల ప్రతిబింబాలే పాత్రలుగా చిత్రింప బడ్డాయి. 1886 వరకూ, దాదాపు ఒక దశాబ్దిపాటు పుంఖాను పుంఖంగా వీరేశలింగం ప్రహసనాలు వెలువడ్డాయి. కొన్ని ప్రహసనాలకు ఆంగ్లమూలాలు ప్రేరణ కలిగించాయి. దాదాపు అన్నిటి రచనా శిల్పిమార్గానికీ ఆంగ్ల రచనలే ఒఱబంతులవ్వడం సత్యదూరం కాదు.

ఆనాటి రాజమహేంద్రి తెలుగుదేశానికి కంతటికీ ప్రతినిధిప్రాయంగా నిలచింది. సమాజంనిండా కులకుల లాడుతున్న విషకుక్షులే ! లంచగొండి దుమ్ముల గొండులే ! పెద్దమనుషులుగా చెలామణి అవుతున్న అవినీతిపరులే ! విద్వాంసులా కేవలం కుక్షింభరులు ప్రతికుతంత్రానికీ కుహనావాదాలందిస్తు బ్రతుకు తున్నారు. మాయోపాయ గోమాయువులగు కులస్వాములు; దాంభికులైన ధనాఢ్యులు వీరి ప్రతినిధులంతా వీరేశ

లింగం ప్రహసనాలకు పాత్రలుగా నిలచారు. సమాజ ప్రతిబింబమంతా వారి ప్రహసనాలను ఆక్రమించింది. అందువల్లనే కొన్నిటికి శాశ్వత సాహిత్య మూల్యాలు కొరవడినా తాత్కాలిక ఆకర్షణకు లోటుకలుగలేదు. కొన్ని నిశితాస్త్రాలుగా ప్రయోగింపబడి విషవృక్షాలను కూకటిప్రేళ్ళతో కూల్చివేశాయి !

మునిసిపల్ నాటకం, జమిందారీ ధర్మఖర్చు, దంభాచార విలసనం, వేశ్యాప్రియం, కౌతుక వర్ధని మున్నగు ప్రహసనాలన్నీ యిట్టివే.

## రంగస్థల ప్రయోక్త

నాటకాలూ ప్రహసనాలూ రచించడమే కాక వాటిని రంగస్థలంపై ప్రదర్శించడానికి పూనుకున్నారు. వీరేశలింగం ముఖ్యంగా ప్రహసనాల ప్రదర్శన వల్ల సంఘం బాగుపడుతుంది. ప్రహసనాలలో ముఖ్యమైన వానిని రంగస్థలంపై ప్రయుక్తం చేసిన తొలిగౌరవం కూడా ఆయనకే దక్కింది. 1880 లో వ్యవహార బోధిని అనే ప్లీడర్ నాటకం రాజమండ్రిలో ప్రదర్శింపబడింది. వెంటనే విజయనగరం దాకా దానికీర్తి ప్రాకింది. విజయనగరం మహారాజా వారి బాలికా పాఠశాల విద్యార్థినులు ప్రదర్శించారు. ఆ ప్రదర్శనాలు ఎంతోవిజయవంత మయ్యాయి. వందలాది ప్రేక్షకులు వచ్చి చూసినట్లు స్వీయచరిత్రలో వ్రాసుకున్నారు. ఇంతకన్న ప్రబలసాక్ష్యం మనకక్కరలేదు.

ఈవిషయమే, ఒక నాటక సమాజాన్ని స్థాపించాలన్న సంకల్పానికి బలమిచ్చింది 1880 నాటికి ధార్వాడనాటక సమాజం వచ్చి రాజమండ్రిలో కొన్ని రోజులు పాటు నాటకాలు ప్రదర్శించింది. తిరిగి వెళ్ళిపోతూ, తమ నాటక ప్రదర్శన శాలను ఒదిలి వెళ్ళింది. ఆ నాటకశాల కాళీగా పడివుండటం వీరేశలింగానికి నాటక సమాజ నిర్మాణ సంకల్పానికాధారమైంది.

ఇట్టి నాటక ప్రదర్శనముల వలన జనులకు వినోదము కలుగుటయే కాక, యక్రమములు చేయువారు సిగ్గుపడి తమ ప్రవర్తనము దిద్దుకొనుటయు, అందువలన నీతి వర్థిల్లుటయు గలుగును కాన — క్రొత్తనాటక సమాజము నొక దానిని స్థాపించవలసినదని నా మిత్రులనేకులు నన్ను కోరిరి, అని స్వీయ చరిత్రలో వ్రాసుకొన్నారు.

కాని ఆయన స్థాపించిన నాటకసమాజము ఎంతోకాలం పని చేసినట్లు దాఖలాలు

కనిపించవు. తెలుగు నాటకరంగస్థలం మీదనే ధార్వాడ నాటకరంగం ఎంతగొప్ప ప్రభావం ప్రసరించిందో తెల్పడానికి వీరేశలింగం కృషి ప్రబల సాక్ష్య మివ్వగలదు.

అట్టి నాటకము లాడుటకదియే ప్రథమ ప్రయత్నమైనను, మొత్తము మీదనవి విజయప్రదముగనే జరిగినవని యెల్లవారు నభిప్రాయ పడిరి. అని వ్రాసుకొన్నారు. (స్వీయచరిత్రలో)

## సమాజానికి చికిత్స

ఆనాటి సమాజం అసంఖ్యాక దురాచారాలతో నిండిపోయింది. మూఢవిశ్వాసాలు విపరీతంగా బలిసిపోయాయి. వేశ్యాలంపటం గౌరవభాజనంగానూ, వీరపురుష లక్షణంగానూ, పరిగణింపబడుతోంది. వీటినన్నిటినీ నిర్మూలించి సమాజానికి చికిత్స జరపడానికి సాహిత్యంకూడా శక్తివంతమైన ఆయుధం కావాలని యుగపురుషుడు సంకల్పించడంలో ఆశ్చర్యం లేదు.

"వీరేశలింగకవి చరిత్ర" అనే గ్రంథంలో తోలేటి వెంకట సుబ్బారావు కూడా వీరేశలింగం తన ప్రహసనాలతో ఆనాటి సమాజంపై ఎంతో ఉజ్జ్వల ప్రభావం కలిగించారని వివరించారు.

డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు వీరేశలింగం గారి సాహిత్యం పై తమ పరిశోధనా గ్రంథంలో— వీరేశలింగంగారి ప్రహసనాలలో పదింటికి మాత్రమాంగ్ల మాతృకలున్నవి. తక్కిన వన్నియు స్వతంత్ర రచనలే ! (పు. 64 ) అని వివరించారు.

హాస్యసంజీవని అనే గ్రంథ శీర్షిక తోనే ఆయన ప్రహసనాలన్నీ మూడు సంపుటాలుగా ప్రచురించారు. అందులో సంపూర్ణ రూపకాలన దగిన ప్రహసనాలు కాక నలభై నాలుగు హాస్యసంభాషణలున్నాయి. గ్రంథస్థంకాని సంభాషణ రూపాలుఎన్నో పత్రికలో మిగిలి పోయాయని డా॥ అక్కిరాజు తెలిపారు. ఐతే అట్టివేవో ఆయన పేర్కొన్నారు.

హాస్యసంజీవని గ్రంథం మొదటిభాగం 1888లో ప్రచురింప బడింది. అందులో 19 ప్రహసనాలున్నాయి. ఇవన్నీ 1876 నుంచి 87 వరకుగల కాలవ్యవధిలో రచించబడ్డవి.

'పెళ్లి పెళ్లైన తర్వాత పెద్దపెళ్లి' అనేది రెండు రంగాల నాటిక మిగిలినవి ఏకాంకికా సంభాషణలు 1) హిందూ మహాజనుల మతసభ. 2) ఆచార్య పురుషుల దాంభికం 3) నవనాగరికులు - వంటి ప్రహసనాలు శీర్షికలననుసరించే యితివృత్తాలను వ్యక్తం చేస్తున్నాయి. నవనాగరికులు మనుకొనేవారు ఎంత అజ్ఞానములో నితోజీవి తాన్ని వెళ్ళమారుస్తున్నారో చివరిది చిత్రిస్తుంది.

హాస్యసంజీవని రెండవ భాగంలో 16 ప్రహసనాలున్నాయి. ఇవి 1886 నుంచి 1891 వరకు రచించబడ్డవి. ఇవన్నీ పూర్తిరూపక లక్షణాలు పొందని హాస్య సంభాషణలే !

ఓమాబండి, యోగాభ్యాసం, అనే ప్రహసనాలు మాత్రం—రెండు దీర్ఘరంగా లకు పరిమితమైనవి. మిగిలినవన్నీ ఏకరంగమాత్రాలు. వేశ్యాసంవాదం, చంద్ర గ్రహణం, తేలుమందు, బహుభార్యాత్వం, యజ్ఞప్రయత్నం, బాలభార్యా వృద్ధభర్తృక సంవాదం, హిందూమహాసభ, బహిష్కారపత్రిక, వంటి ప్రహసనాలన్నీ—గతాను గతికంగా సాగిపోతున్న ఫ్యూడల్ సామాజిక దుర్నీతులకూ, పరపాలనా జన్యమైన బానిసత్వ మానసిక రోగాలకూ వీరేశలింగం దీక్షగా కావించిన శస్త్రచికిత్సలే !

నూరేళ్ళ సాంఘిక జీవన పరిణామంలో మన ఆలోచనలు హేతువాద బద్ధతను అలవర్చుకొన్నాయి. అభిరుచులు నైశిత్యాన్ని అలవర్చుకొన్నాయి. మన హృద యాలు నూత్నసంస్కార పూంజీకృతాలయ్యాయి. ఇంతమార్పు పొందిన నేటి మన దృష్టికి వీరేశలింగం రచించిన అసంఖ్యాక ప్రహసనాలు మోటుగాను, హాస్యం చిటువు గాను, అడపా తడపా అసభ్య భూయిష్టాలుగానూ, అందందు అశ్లీల భరితాలుగూ కనిపిస్తాయనడం సత్యదూరం కాదు.

కానీ మనం ఒక ప్రధాన సత్యాన్ని విస్మరించ కూడదు. వీరేశలింగం కేంద్రీక రించిన సర్వసాహిత్య వ్యాసంగమూ ఆయన నిర్వహించిన సంఘసంస్కరణ మహోద్య మానికి నేపథ్యంగానూ, ద్వితీయ రంగంగానూ, పరిఢవిల్లినదేనని మరువకూడదు. ఆ మహోద్యమం ప్రప్రథమ సాంఘిక విప్లవముగా రూపొందినది. కనుకనే ఆ ఉద్యమాన్ని సంప్రదాయ దాసులు తీవ్రంగా ప్రతిఘటించారు. వెనుకచూపుతో వెనక్కిలాగడానికే ప్రయత్నించారు, అయినా ఆయన లెక్కచేయలేదు.

దానికి కారణం వీరేశలింగానికి భవిష్యత్ పట్ల జాగరూకమైన నిఘా ప్రధాన

ప్రకృతిగా మారిపోయింది. అయితే ఆయన ఆశించిన సుందర భవిష్యత్తు ఎక్కడి నుంచో ఆకాశంనుంచి ఊడిపడేదికాదు. వికారమూ, కశ్మలవంతమూ కాలుష్యభరితమూ అయిన వర్తమాన పంకం నుంచే పుట్టుకరావలసింది కనుకనే వర్తమానాన్ని సంసిద్ధం చేసుకోవలసివుంది. వర్తమానం నుంచే భవిష్యత్తును పెరికించాలి. సహజంగా మనిషి దైహిక నిర్మాణంలోనే ముందుకు నడిచే స్వభావం వుంది. కాని సంప్రదాయ మౌఢ్యాల భారం వల్ల అతని మనస్సు గతంలో నిద్రపోనారంభించింది. సమకాలిక జీవితాన్ని సత్వతో ముఖంగా అనుభవిస్తూనే భూతకాలంమీద విశ్వాసం పెట్టుకొని, తన ఉద్యమాన్ని విమర్శించే వారినీ, త్రిప్పికొట్టజూచే వారినీ సర్వ ఆయుధసంపదనూ సమకూర్చుకొని ఎదుర్కోవాల్సి వుంది. ఆ ఆయుధ సంపదలో ఒక నిశితాస్త్రజాలమే ఆయన ప్రహసనాలు !

సూరేశ్వ క్రిందటి సామాజికులు జీవనభృతి సంపాదనార్థం ఆంగ్ల విద్య నేర్చుకుందుకు ఎగబడుతున్న వారే. అయినా వారి మనసులు - యుగయుగాల భూస్వామ్యవ్యవస్థా దురాచారాలకు కట్టుబానిసలై ఉన్నాయి. వారి హృదయాలు మోటుగా అనాగరీకంగా కటువుగా మూర్ఖంగా గుడిసుళ్ళు తిరుగుతున్నాయి. ఇది ఆనాటి బాహ్య వాస్తవికత. సామాజికుల అభిరుచి బాహుళ్యం అనే యథార్థభూతలం నుంచే ఒక రచయిత చైతన్యం ఉద్భూత మవుతుంది. ఆ పరిస్థితుల కనుకూలంగానే రచనా నైపుణ్యమూ నిర్ధరింప బడుతుంది.

ఆంగ్ల సాహిత్యం నుంచి ఎన్నెన్ని కొత్తవిషయాలూ, కొత్త ప్రక్రియలూ తాను నేర్చుకొన్నా తాను రచించినవే దించవలసింది యింకా సునిశితత్వం అలవర్చుకోని తెలుగు పాఠకుల కోసమేనన్న స్పృహ ఆయన ఎక్కడా విస్మరించలేదు. తాను బోధించవలసిందీ ఆ మొరటుగుండెలకే ! ఈ సత్యసందర్శనం వీరేశలింగానికి సమృద్ధిగా ఉందని నిస్సందేహంగా చెప్పవచ్చు !

## అక్షయ తూణీరం

హాస్యసంజీవని తృతీయ భాగం 1896_97 నడుమ వ్రాయబడిన ఏడింటి ప్రహసనాలతో సంపుటీకరించబడింది. కామరూప మంత్రం అనే ప్రహసనం 1896లో రచించబడి చింతామణి పత్రికలో ప్రచురిత మైనదేకాని ఎందువల్లనో అది ఈ

సంపుటిలో చేర్చబడలేదు. మూడోభాగంలోని ప్రహసనాలన్నీ పెద్దవి, కన్యాశుల్కం, వినాయకచతుర్థి, అతిబాల్య వివాహం పూర్వాచారములు—అనే ప్రహసనాలు మాత్రం ఒకో్కరంగానికి పరిమితాలు.

మునిసిపల్ నాటకం మూడు అంకాలుగా ఎనిమిది రంగాలుగా విభక్తమైంది. ఉలాయి శాస్త్రి మూడు రంగాలు, తిర్యగ్విద్వన్మహాసభ, మహారణ్య పురాధిపత్యం అనేవి దీర్ఘ ప్రహసనాలే! కౌతుక వర్ధనీ మూడు అంకాలు, భ్రాంతి తరంగిణి, సత్యవాదిని కేవల హాస్యసంభాషణలు.

మొత్తానికి వీరేశలింగం రచించిన నలభై ఏభై ప్రహసనాలు ఆ అక్షయతూణీరం నుంచి వెలువడు శస్త్రాస్త్రాలే! మూఢవిశ్వాసాలపై కేంద్రీకరించినవి పదిహేను, సంఘసంస్కార ప్రేరకాలు ఇరవై ఒకటి; మిగిలిన ఎనిమిది నవనాగరికుల దుష్ప్రవర్తనలు, అజ్ఞానాలు, స్వార్థపరత్వాలు, సంఘద్రోహాలు, సామాన్య మానవుల అమాయకత్వాలు, ఇతి వృత్తాలుగా స్వీకరించినవి.

కలిపురుష శనైశ్చర్య విలాసం, వేశ్యాప్రియ వినోద తరంగిణి, దంభాచార విలసనం, వంటివి కొన్ని పై మూడు సంపుటాలలోనూ చేరలేదు.

వీరేశలింగం ప్రహసనాలలోని పాత్రల పేర్లన్నీ సాధారణ గుణావిష్కారాలే. అందువల్ల మన ఆధునిక దృష్టికి అవాస్తవికంగా తోచకపోవు. మన పురాణసాహిత్యం నిండా మంచి పాత్రలకు మంచి మంచి పేర్లున్నూ, దుష్ట పాత్రలకు దుష్ట భావార్థక నామాలున్నూ పెడుతూండటం పరిపాటి. అంటే మన పౌరాణికుల అవగాహనలో మనుషులు—దుర్జనులుగానూ సజ్జనులుగానూ విడివిడిగా బ్రతుకుతూంటారనీ, పరస్పరం సంఘర్షించుకుంటూ వుంటారనీ, విజయం సాధిస్తారనీ పాతుకుపోయిన నమ్మకం.

అందువల్లనే రావణ, మారీచ, కుంభకర్ణ, దుర్యోధన, దుశ్శాసన కీచకాది నామాలు సృష్టించ బడ్డాయి. ప్రతి కుమారుడూ తన తండ్రికి నందనుడే! వాడు సౌశల్యంతో బ్రతకాలనే ఆశిస్తాడు. దుర్మార్గద్యోతకాలైన పేర్లను ఏతండ్రీ కొడుక్కి పెట్టుకోడు.

కాని వీరేశలింగం తనకుతానుగా ఆధునిక చింతనకు అక్షరాభ్యాసం చేయవలసిన మనిషి పురాణ సాహిత్య దుష్ప్రభావం ఆయన మనస్సునుంచి పూర్తిగా నిష్క్రమించ



లేదు. పైగా పాత్రలకలాంటి పేర్లుంటేతప్ప శ్రోతలు అవగాహనచేసుకోరేమోనన్న సంశయమూ ఉండి వుంటుంది. కారణాలేవైనా వీరేశలింగం పాత్రలకు పెట్టిన పేర్లు అసహజంగానూ అవాస్తవికంగానూ, మోటుగానూ, మనకి ధ్వనించడం సత్యేతరం కాదు.

అనాటి సాంఘిక రాజకీయాది చారిత్రక నేపథ్యం నుంచి కనక మనం పరిశీలిస్తే అప్రహసనాలన్నీ ఎంత మహత్వ పూర్ణాలో అవగతమవుతుంది.

సమకాలిక ఇతి వృత్తాలను స్వీకరించి కావ్యాలను రచించడం భారతీయ సంప్రదాయానికి విరుద్ధంకాదు. రామాయణ భారతాదులు సమకాలీన యితివృత్తాలే !

## సమాజం నిండా వేశ్యాప్రియులే

ఆనాటి సమాజం వేశ్యలతోనూ, వేశ్యా ప్రియులతోనూ నిండిపోయింది. జరుగుబాటుగల ప్రతి పురుషుడూ ఒక వేశ్యని ఉంచుకోవడం ఘరానావ్యవహారంగా సర్వామోదకరంగా నిలచింది ఈ దురన్యాయాన్ని రూపుమాపడానికి వీరేశలింగం తన సాహిత్యంలో అసంఖ్యాక ప్రక్రియలుపయోగించారు. ముఖ్యంగా ప్రహసనాలలో ఎన్నో దీనికై వినియుక్త మయ్యాయి. వేశ్యాప్రియ ప్రహసనంలోని పాత్రలపేర్లు నైజ గుణాలు తెలిపేవిగా రూపొంది మరీ అవాస్తవికంగా తయారయ్యాయి. ఆధునిక సాహిత్యరసుల వాస్తవికతా దృష్టికి మరీ ఎబ్బెట్టుగా కనిపిస్తాయి. మన సమాజంలో మంచి మంచి నామధేయాలు కలవారెందరో చెడు నడతలతో భయపెడుతూ ఉండడం మనం నిత్యం చూస్తున్నదే !

పంతులుగారు పెట్టిన పేర్లు ఔచితీ శోభితములేగాక, చమత్కారములుగా కూడ ఉన్నవి. అని ప్రశంసించ వలసిన పూచీ పరిశోధకుని కుండనక్కరలేదు. పైగా అది అవిచార పూరితం కనక అసంగతంగానూ కనిపించక తప్పదు. ఆధునిక వాస్తవికతా దర్శనా రాహిత్యాన్నికూడా అభివ్యక్తం చేయకపోదు. వేశ్యాప్రియులగు గణికా ప్రాణనాధరావు, విటేంద్రరావు, అని పిలుచుట, సంస్కారపరులను వివేకరావు, సత్య ప్రియాచార్యులు, వినయభూషణరావులని పిలుచుట, పంతులుగారి సంస్కారప్రియతను చాటి చెప్పుచున్నది. (పు. 68)

పంతులుగారి సంస్కార ప్రియత్వాన్ని చెప్పడానికి ఇంత క్షీణకారణంపై ఆధార





పడటం పరిశోధకుని కురచ చూపునే ప్రదర్శిస్తుంది. పంతులుగారి మహత్త్వానికి అది శ్లాఘ్యతగా నిలవదు.

కలిపురుష శనైశ్చర్య విలాసం 1892 లో రచింపబడింది. విగ్రహారాధనం మద్యపానం, వేశ్యాగమనం వంటి దురాచారాలను తూర్పార బట్టింది. ఇది నాలుగు రంగాల ప్రహసనం. కౌతుకవర్ధని కూడా వేశ్యాలంపటత్వం పైనే కేంద్రీకృతమైంది నరసింహరావు పంతులు సుబ్బారావు పంతులుగార్లు వేశ్యాసంపర్కానికి వ్యతిరేకులు. నాగభూషణరావు, గంగాధరశాస్త్రి తదనుకూలురు. వేశ్యాసంగమం అత్యవసరమని వాదానికి దిగినవారు. ఈ ప్రహసనం నాటికి పాత్రల పేర్లు సంభావస్వయం వ్యక్తీక రణలుగా ఉండనక్కరలేదని సమాజవాస్తవికత ప్రధానమనీ వీరేశలింగంగారికి స్ఫురించి ఉంటుంది. సామాన్య మానవుల మౌలిక నామాలే రూపకానికి ప్రాణప్రదులనీ వారు గ్రహించినట్లు కనిపిస్తుంది. మానవులందరిలోనూ మంచీ చెడ్డా సమానంగానే ఉంటాయి పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఏదో ఒకటి పెచ్చరిల్లుతుంది.

వీరేశలింగం తెలుగుజాతి నోముల పంటగా పుట్టిన విశ్వకుటుంబి ! ఆయన కలాంటి అపప్రథలంట కట్టడం ఉత్త తోడేలు బుద్ధి ! జమీందారుగా పుట్టడం వల్లనే "టాలస్టాయి" రచనలలో జమీందారుల సమర్థతఉందని ప్లెఖనోవ్ అంతటివాడు పొరబాటు అభిప్రాయం వ్యక్తంచేశాడు. అది శుద్ధ తప్పని ఆనాడే నిరూపించాడు లెనిన్ మహాశయుడు. పైగా ఆయనతోలుస్తాయి ని Morror of the Russian Revdvtion అని కీర్తించాడు. (రష్యన్ భాషోచ్చారణ ప్రకారం తొలుస్తాయ్ అనాలి)

సాహిత్యకారుడుగా వీరేశలింగాన్ని మనం ఖచ్చితంగా తోలుస్తాయితోపోల్చుకొని అట్టి స్థానమే యివ్వవచ్చు.

## నిర్నిరోధక వృద్ధ వివాహాలు

వీరేశలింగం వృద్ధ వివాహాన్ని ఇతివృత్తంగా తీసుకొని చాలాప్రహసనాలే రాశారు. వినోదతరంగిణికి కూడా అదే వస్తువు. అయితే యిది మరింత పచ్చి వాస్తవికతకు లోనయింది. భీమారావు భ్రూణహత్యకు పూనుకుంటాడు. తహశీల్దారు కోర్టులో కేసుబనాయింప బడుతుంది. ఇలాంటి ఘట్టాలన్నీ రంగంపై జరిగి అసహ్యం కలిగిస్తాయి. జుగుప్సా వహంగానూ ఉంటాయి. అయినా అవి సామాజిక వాస్తవిక

 

తలు కావని ఎవరమూ అనలేము. పైగా వీరేశలింగం సకల ప్రహసనాలనూ రంగస్థల ప్రదర్శనాలుగానే రచించాడని ఎవరూ అనలేరు. చాలా భాగం కేవలం పఠన పాఠశాలకే పరిమితాలు కనక ఇబ్బంది ఉండదు.

పత్రికానిర్వాహకునిగా ఆయనకు అనేకబాధ్యతలు, ధర్మాలూ ఉన్నాయి. తాను కోరి ముద్రించదలచిన రచనలు ఇతర రచయితలనుంచి లభించేవికావు. పైగా కొత్తచూపుగల రచయితలే ఆనాడు దుర్లభం. అలాంటి గడ్డుకాలంలో అసంఖ్యాక బాధ్యలతోపాటు రచనావ్యాసంగాన్నీ ప్రముఖంగా నిర్వహించ గలగడమే పరమాద్భుతం. పరిస్థితులాయన మనస్సుపై ఎంత ఒత్తిడి చేసేవో బుద్ధిమంతులకు ఊహకందనిది కాదు. అంత నిరంతర క్రియాశీలి నుంచి ఇంతకన్న అపురూప కళాఖండాలను ఆశించడం పేరాశే కాగలదు. పైగా మన వైరితనమూను!

ఆంగ్ల ప్రహసనాలకు అనుసరణలుగా మరోపది_'adapted from English farce'అని ముఖపత్రంపై ప్రత్యేకించబడినవి ఉన్నాయి. ఇవి అనుసరణలు మాత్రమే అని సాధికారికంగా పరిశోధకుడంటున్నాడు. అపూర్వ బ్రహ్మచర్యం, విచిత్ర వివాహం, మహాబధిరం, పునర్మరణం, బలాత్కారగాన వినోదం, కలహ ప్రియ, మహామహోపాధ్యాయ, యోగనిద్ర, మహావంచక అసహాయశూర, అనే పది ప్రహసనాలూ కేవలం పఠనానికే నిర్దిష్టమైనవి.

అపూర్వ బ్రహ్మచర్యంలో రమాకాంతం అనే వకీలు స్త్రీలోలుడు తన సేవకుడు కరకటరెడ్డి భార్య మోహినిని మరులు గొంటాడు. రెడ్డిని ఎలాగైనా పైకి పంపి కన్నుగప్పి ఆమెని అనుభవించచూస్తాడు. అతని భార్య పొరుగూరికి పోయి యింతలో రాదనుకొన్నది___హఠాత్తుగా ఊడి పడుతుంది. కథ అడ్డం తిరుగుతుంది. ఇలాంటి సన్నివేశాలు, మరి రెండు మూడు ప్రహసనాలలో చోటు చేసుకొన్నాయి.

విచిత్ర వివాహంలో ధనకోటిరాజు వకీలు విధురుడు; ద్వితీయవివాహం చేసుకోదలచాడు. అన్న కొడుకు వెంకటపతిరాజును దగ్గర పెట్టుకుంటాడు. అతను రతీసుందరిని ప్రేమిస్తాడు. ఆమె మేనత్త మోహినీదేవి చతుర, ధనకోటిని వలపులలో బంధిస్తుంది.

మహాబధిరలో సుసుంప్తుడొక ధనికుడు. తనకుమార్తెను ధనపాలుడనే లుబ్ధునికిచ్చి వివాహం చేయాలను కుంటాడు. అది తన కూతురు ఇందుమతికి ఇష్టముండదు.




పైగా ఆమె విజయవర్మని ప్రేమిస్తుంది. చెలికత్తె విశాలాక్షి పన్నాగంతో విజయవర్మ యింట ప్రవేశించి చెవిటి వానిలా నటిస్తాడు.

పునర్మరణంలో చండశాసనుడు ఒక గృహస్తు. అతనికూతురు మనోరంజని ఆమె త్రివిక్రమవర్మను ప్రేమిస్తుంది. ఆమె మేనత్త మృదుభాషిణి. త్రివిక్రమవర్మ తన మిత్రుడు మాధవవర్మ సహాయంతో వెదురుపేళ్ళ బుట్టిలో దాగి మృదుభాషిణి యింటికి చేరుకుంటాడు, మృదుభాషిణి పరిచారిక జానకి మాధవవర్మ ప్రియురాలు కావడంవల్ల ఈ పదకం పారుతుంది.

బలాత్కార గాన వినోదంలో గానప్రియుడు ప్రధానపాత్ర. విశ్వనాథశాస్త్రి అనే మహాగాయకునిచేత ఎలాగైనా సారంగ పాణి పదంపాడించుకొని వినాలని కుతూహల పడతాడు. విశ్వనాథశాస్త్రి అంగీకరించక దొరక్కుండా తిరుగుతూంటాడు,

అతడు పిఠాపురం వెళ్ళిపోతున్నట్లు విన్న వాడై గానప్రియుడు ఎలాగైనా బలాత్కారముగా తీసుకురమ్మని భటుల్ని పంపుతాడు. వాళ్ళు పొరబాటున విస్సన్న పాత్రుడనే వాడ్ని మోసుకువస్తారు. అతడే సంగీత విద్వాంసుడనుకొని గానప్రియుడు సకలోపచారాలూ చేసి పాడమని నిర్బంధిస్తాడు. ఇంతలో గానప్రియుని మేనల్లుడు సంగీతరావు వస్తాడు. అతడు మామకూతురు లీరావతిని ప్రేమిస్తాడు. మేనమామని మెప్పించి ఎలాగైనా ఆమెని పెళ్ళాడాలని కోరిక. విస్సప్పపాత్రుని పాడుతున్నట్లు నటించమని తాను ప్రక్కగదిలో గోప్యంగా ఉండి పాడి మెప్పిస్తాడు.

కలహప్రియ, మహామహోపాధ్యాయ, యోగనిద్రవంటి ప్రహసనాలు ఆంగ్లభాష నుంచి అనువదించడంలోగాని, అనుసరించడంలోగాని పంతులుగారు జయంపొందలేదు అంటాడు పరిశోధకుడు అక్కిరాజు.

ఐతే అన్ని ప్రహసనాలలోనూ అచ్చమైన వాడుకభాషనే ఉపయోగించారు. చక్కని నుడికారమూ ఉపయోగించారు. కాని కొన్నిచోట్ల ఆంగ్లభాషా ప్రభావం చోటు చేసుకొని బైబిలు అనువాదాల్లా దుర్భరంగా ఉన్నతావులూ లేకపోలేదు. ఉదాహరణకి ఒక్కటి :-

"మనోరంజకి మరచిపోవడంకూడానా! నేనెప్పుడూ మరచిపోను" వంటివానిని భరించగలంకాని——"నేను విచారంగానే ఉంటాను అత్తా ! నేను ఒకటిచెబుతాను విను.

నన్ను ఈ ప్రకారంగా నీవు వోదార్చడానికి ప్రయత్నించడం ఎంతమాత్రం బాగాఉన్నది కాదు!'' వంటి వానిని ఎంత సానుభూతితో చదివినా సహించలేం!

తొట్టతొలి ప్రహసన ప్రక్రియను వీరేశలింగమే సృష్టించి, రచనాధిక్యంతో ఆయనే దాని శిల్పసంపదను పోషించుకున్నారు. ఈ కారణంవల్లనే కొన్ని ప్రహసనాలలో ఆదిమత్వం, ప్రాథమికత్వం తప్పనిసరి లక్షణాలయ్యాయి. వారి దృష్టిలో సౌందర్య దృష్టికన్న సంఘ ప్రయోజన దృష్టి అధికం. కళానిష్ఠాతృత్వం కన్న సంఘసంస్కరణ ప్రయోగశాలిత్వం మిక్కుటం.

# ఖనిజ సంపద

తెలుగుభాషకు అసంఖ్యాక ప్రహసనాల నందించి వీరేశలింగం ఒక మహత్తర ఖనిజసంపదను చేకూర్చారు. అందలి పాత్రచిత్రణ విషయంలోగాని సంఘటన నిర్మాణం విషయంలోగాని, ఇతివృత్త నిర్వహణ సందర్భంలోగాని, సంభాషణా వైచిత్రిలో గాని ఎంతో తరివిణి పట్టని ముడుసరుకు సహజంగానే వచ్చి చేరింది. ఈ యాపద్విషయాల లోనూ జరిగిన జయాపజయాలను కూలంకషంగా అవగాహన చేసుకొన్న ఆయన శిష్యులు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు కాని, గురజాడ అప్పారావుగారుకాని—ఆ ప్రక్రియను ఎంతో పరిపుష్టం చేసారు. కళామయంగా సంపన్నము చేశారు.

వీరేశలింగం రచించిన ప్రహసనాలన్నీ ఆనాటి రాజమండ్రి సాంఘిక జీవితానికే గాక పతనోన్ముఖ మవుతున్న భూస్వామ్య వ్యవస్థా సాంప్రదాయా లన్నిటికీ అద్దం పట్టడమే కాక, ఆ వ్యవస్థ అచిరకాలంలో ఛిద్రత పొందడానికి దోహద మందించాయి. పాత సమాజంనుంచి చీల్చుకు వచ్చిన నూతన శక్తులకు స్వాగత మందించాయి. పరస్పరం సంఘర్షించిన రెండు విభిన్న శక్తుల హావభావ విలాసాలను సజావుగా చిత్రించడం వల్లనే వీరేశలింగం ప్రహసనాలు సమకాలిక సమాజంలో అమిత సంచలనం కలిగించగలిగాయి. తద్వారా ఆయన కెందరో విరోధులయ్యారు. కోర్టుల కెక్కి పరువు నష్టం దావాలు చేశారు. కొందరు ఉద్యోగాలు కోల్పోయారు. ఎందరో అప్రతిష్ఠల పాలయ్యారు. ఆయన పేరు దురాచార పరులకు సింహస్వప్నమై పోయింది. ప్రతిఘటించడానికి శక్తిలేనివారు పిరికితనంతో దొంగ దెబ్బతీయడానికి ప్రయత్నించారు. వీరేశలింగం పాత్రనే యధాతథంగా తీసుకొని ప్రహసనాలు రచించి ప్రచురించారు.



అట్టివారిలో కొక్కొండ, కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి ముఖ్యులు. ఐతే అట్టి వారికి వీరేశలింగం శత్రువులుగా తప్ప మరే ప్రాధాన్యతా చరిత్రలో మిగలలేదు.

వేమన వలెనే వీరేశలింగం కూడా సాహిత్యాన్ని సంఘ సంస్కరణ మహా యుధంగా ఉపయోగించికవారు. ప్రతిజీవి జీవించడం కోసమే తిండి తింటుంది. ఆహారంకోసమే ఆహారం ఎప్పుడూ ఏ జీవి తీసుకొని ఎరుగదు. అలాగే కళకోసం కళ అనుకోవడంగాని, సాహిత్యంకోసం సాహిత్యమనుకోవడం గాని వీరిరువురూ త్రోసిరాజన్నారు. సంఘ ప్రయోజనం కోసం సాహిత్యాన్ని సృష్టించారు.

వినాశోన్ముఖ మవుతున్న రాజరిక వ్యవస్థను శక్తివంతముగా చిత్రించి దాని చారిత్రిక నాశనానికి దోహదం చేసిన షేక్స్పియర్ మహాకవి వలెనే—వీరేశలింగం—భూస్వామ్య వ్యవస్థా జన్యమైన సకల దురాగతాలనూ కూల్చివేశాడు !



# వీరేశలింగ సంస్మృతి

మల్లంపల్లి శరభయ్య

ఆధునికాంధ్ర సంస్కృతి మహాసౌధ నిర్మాతలైన మహాపురుషులు ముగ్గురని యందురు.

కందుకూరి వీరేశలింగముగారు

కాశీనాధుని నాగేశ్వరరావుగారు

కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు

వీరు ముగ్గురు "త్రిలింగముల" వలె శైవ బ్రాహ్మణులే అయియుండుట అనూహ్యమైనవిధి విధానము !

వీరిలో - వీరేశలింగంగారు మొదటివారు.

వీరేశలింగము గారి నాటి దేశకాల పాత్రములను నేటివారు తమభావనా పథములలోనైనను రూపొందించి కొనగిలుగుట గహనమనిపించును.

ఆయన సాంఘిక వాఙ్మయ రంగములలో తెచ్చిన మార్పులు అంతటి సుదూర భవిష్యత్తులకు వ్యాపించు లక్షణము కలవి.

అనాదిగా గోదావరీ జలమంతయు సముద్రము పాలేయగుచున్నది. ఆరోజుల లోని ప్రజల జీవన విధానము —ఆనకట్ట నిర్మింపబడి — కాలువలు — వానినుండి పంటకాలువలు — తీర్పబడి సుఖమయ జీవనము సాగించుచున్న నేటి ప్రజలకుతెలియదు నిత్యజీవితములో - ఆనకట్ట ప్రయోజనములకు అలవాటు పడిపోయిన మనకు - మొదటి నుండియు ప్రజాజీవితమిట్లే సుఖమయముగా సాగివచ్చుచున్నదనిపించును. అంతకుమునుపు శతాబ్దముల కైనను రాని మార్పులు — ఇపుడు దశాబ్దముల మీదనే వచ్చుచున్నవి. కొండచిలువ వంటి కాలగతి కూసము విడిచిన త్రాచువలె మారినది.



వీరేశలింగముగారి బహుముఖ సంస్కారబోధ్యమౌ ఫలములను నిత్యజీవితములో ప్రతిక్షణము అనుభవించుచున్న మనకు ఆయన స్వరూప స్వభావము లెట్టివో తెలియదు తెలిసికొన వలసిన అవసరమున్నదని గమనించుటకు వలసిన వ్యవధికూడ చాలనిరీతిగా నేటి జీవిత విధానము సాగిపోవుచున్నది.

ఆయన సంఘసంస్కారములు వాఙ్మయ సంస్కారములు పత్రికా యుద్ధములు మొదలైన వివిధోద్యమ సన్నాహములు కథాప్రసంగములుగా మిగిలిపోయి — నేటికి మనకు మిగిలినది — ఆయన శిలావిగ్రహ మొక్కటియే !

అది - ఎండలకెండి - వానలకు తడిసి — మంచులో బిగిసి — నిరాచ్ఛాదనమై నిరాలంబమైన ఆకాశము క్రింద - తన అస్తిత్వమును ఏమాత్రము పట్టించికొనని నిత్యవ్యగ్రమైన జనజీవితమునకు సాక్షిగా నిలుపవలసిన శిక్షకు పాత్రమై యున్నది. అది శిలావిగ్రహమేయని మన నమ్మిక కావున జయంతులకో వర్ధంతులకో దండలువేసి ఉపన్యాసములు చేయించగలుగు చున్నాము.

ఎంతటి చైతన్య శక్తియైనను శిలావిగ్రహంగాపరిగణింప చేయగలిగిన అద్భుత కాలమునకున్నది. ఆ - అహార్యనిశ్చయము మూర్తీభవించిన కార్యదీక్ష అప్రధృష్య త్వము. కొట్టవచ్చినట్లున్న ఆ మూర్తిని విగ్రహమనియే మనము సమీపింపగలుగుట !

బ్రతికియున్న దినములలో ఆయన ఎంతటి భయంకరుడో ! కన్నులు చింత నిప్పులు ! పట్టినది కలమేయైనను ఆ కలము మహాఖడ్గమువలె భయంకరము ! అది వీరేశ్వరావతారము ! ఆ బుట్టతలపాగా ఒక్కటి చాలును. సింహస్వప్నమువలె గుండె దడదడ పుట్టించుటకు...

ఆ సత్యకోపము మహారాజులను కూడా గడగడలాడించెడిదట !

శూరునిచూచిన భీరువులకు భయమును నీతిపరుని యెదుట అవినీతిపరులకు సంకోచమును సత్యనిష్ఠుని ముందు అసత్యవచనులకు మొగము చెల్లక పోవుటయును, వ్యవసాయశీలుని సమక్షమున నిర్వ్యవసాయులు నిస్తేజులగుటయు సహజము.

అనుదిన సంస్కారము లేనిచో దేహము గేహము కూడా రోతపుట్టించును. స్నానాదికమువలనే దేహమునకు, సమ్మార్జనాదికమువలన గేహమునకు, నివాసయోగ్యత సిద్ధించునట్లు - గతానుగతికములైన మూఢాచారములచేత ధూళిధూసరితమై పాడ్పాటు

పట్టి పహామరిక లేక అలక్ష్మీ నివాసమైన సంఘజీవితమునకు - అప్పటప్పటికి సంస్కారము ఆవశ్యకమై మేలు కలిగించుచుండును. ప్రతియుగారంభమునందు మడుగు వేలుపులై సంస్కర్తలుదయించి ధూళితుడిచి బూజుదులిపి నీరుచిలికి ముగ్గుపెట్టి సంఘజీవితభవనప్రాంగణమునకు నూతన శోభనలవరించి లక్ష్మికి నెలవు కల్పింతురు.

ఈ జగన్మందిరమునందు ఋతువులు వచ్చిచేయు పనికూడనిదియే. ఈ సృష్టిధర్మమునకు విశ్రాంతిలేదు. క్రొత్తది నిర్మింపఁబడుటకు ముందు పాతది నిర్మూలింపబడుచునే యుండును. సంధిదశలో కొన్ని ప్రాణులు నలిగిపోవుటయును అపరిహార్యమైన పరిస్థితి. ప్రతికాల విభాగమునందును ఐక కాలికముగ సంహారపునస్సృష్టులు ప్రవర్తించుచునే యుండును.

రుద్రాంశము లేనిచో సంహారకార్యక్రమము నెరవేరదు. ఆ సంహారకేళిలో ఎక్కువ చెడుతోపాటు కొంచెము మంచియును నశింపక తప్పదు. కలుపు మొక్కలతోపాటు కొన్నిమంచి మొక్కలును పోవును. అయినను యుగధర్మము ప్రవర్తించియే తీఱును. అట్టి ఒకానొక రుద్రతేజః కణముచేత ఆవేశింపఁబడిన మూర్తిగా వీరేశలింగముగారు నాకు గోచరింతురు. అది అతిమానుషమైన శక్తియే కానిచో - అంతటిరోగదుర్బలమైనభౌతికోపాధితో — ఒకసామాన్యుడైన తెనుఁగు పండితునిచేత — అంతటి ప్రతికూలములైన దేశకాలములలో - ఇంతటికార్యకలాపము నిర్వహింపఁబడనేరదు.

సంఘసంస్కరణ కార్యకలాపములు తత్సిద్ధికై తాను నెలకొల్పిన వివిధసంస్థలు అట్లుండగా — వీరేశలింగముగారు శతాధికగ్రంథకర్తయై ఆధునికాంధ్ర వాఙ్మయప్రపంచ సమున్మీలనమునకు ఎన్నో క్రొత్తదారులు తీర్చెను. నేటి ఆంధ్రవాఙ్మయసౌధ సమున్నతి యంతయును ఆయనతీసిన పునాదుల లోతులమీదనే ఆధారపడి యున్నదందురు.

చరిత్ర నిర్మాణమునకు ఆవశ్యకములైన శాసనాదిపరికరము సమృద్ధిగావెలువడని ఆ మొదటిరోజులలో ఆంధ్రకవుల చరిత్ర నిర్మాణమునకై ఆయన యెంతో పరిశ్రమకులోనయ్యెను.

అపూర్వములైన గ్రంథములనెన్నింటినో వెలువరించెను. పుక్కిటిపురాణములుగనున్న కవిచరిత్రములను సికరము తేల్చెను. వివాదాస్పదములైన దేశకాలములను నిర్ణయించెను కవులు దేశకాలములను నిర్ణయముపంటి ప్రత్తిపని మఱిమొకటియుండదు. తరువాత వెలువడిన ఆంధ్రకవుల చరిత్రగ్రంథము లన్నింటికి వీరేశలింగముగారి

గ్రంథమే మార్గదర్శకమయ్యెను. ఉపకరణముచాలనిఆరోజులలోరు జాగ్రస్తమైన దుర్బల శరీరముతో ముసరికొని వచ్చుచున్న జరాభరముతో హిమాలయ సన్నిభమైన ఆ కార్యభరమును ఆయన యెట్లు నిర్వహించెనో దైవమునకే తెలియవలయును.

కాలముయొక్క విలువ ఆయనకు తెలిసినంత మఱియొకరికి తెలియదేమోయని పించును. వీరేశలింగముగారు తాను బ్రతికిన ప్రతినిమేషమును లోకహితమునందే పర్య వసింపఁజేసెను. ఆయనను భావించినపుడెల్ల నీసూక్తియేస్ఫురణకు వచ్చుచుండును.

"క్రియాసిద్ధిస్సత్వేభవతిమహతాంనోపకరణే"

మనయందు తాదృశమైన క్రియాశూరత్వమును జాగరితము చేయఁగలిగినవాఁడే అట్టివీరుల సంస్మరణము సార్థకమై తేజస్వి కాఁగలదు. లేనినాఁడు ఆయనకు సమ్మతముకాని ఆచారమాత్రముగమిగిలిపోవును.



# యుగకర్త శ్రీ వీరేశలింగము పంతులు

డా॥ అక్కిరాజు రమాపతి రావు
హైదరాబాదు

వీరేశలింగము పంతులు నిశ్చయముగా మహా పురుషుడు. ఒకానొక సంధి కాలమున తెలుగుదేశము నుద్ధరించుటకు తనువెత్తిన మహాత్ముడు, మానవతావాది, మహనీయుడు. "విశ్వశ్రేయః కావ్యమ్" అను సూక్తికి లక్ష్యభూతముగా సాహిత్య సృష్టికి గడంగి తెలుగువారి హృదయ క్షేత్రము లందలి తమఃపుంజములను పారద్రోలిన సహస్రభానుడు పంతులుగారు. అనేక కారణములను పురస్కరించుకొని తెలుగువారి సాహిత్య చరిత్రమునందు సాంఘిక చరిత్రమునందు వీరేశలింగము పంతులు పేరిటి నొక యుగమే వెలసినదన్నచో అతిశయోక్తి కాదు. పంతులుగారు పుట్టుటకు పూర్వపు తెలుగుదేశపు స్థితి, వ్యభిచారము పురుషలక్షణము అసత్యము ప్రయోజకుని పనిగా నుండెడిది. అంధ విశ్వాసములు, దురాచారములు, విశృంఖలముగా విహరించుచుండెను. వృద్ధ వివాహములు, కన్యాశుల్కము, బాల్య వివాహము ప్రచురముగా నుండెను. మానవుల కష్టనష్టముల యెడ దయాదాక్షిణ్యములు లేని, క్రూరాచారములు, సంఘమును నాడు శాసించుచుండెను. స్వార్థపరులైన కొందరు శాస్త్రములకు విపరీతార్థములను కల్పించుచు, శిష్టాచారము పేరిట దయావిహీనమైన సాంఘిక వ్యవస్థను రక్షించుచుండిరి. ప్రజలలో మౌఢ్యము, దురాచారములు, దంభము, పరపీడన నాడు ప్రచురముగా నుండెను. ఇట్టి స్థితియందు పంతులుగారు తెలుగువారి సాంఘికాభ్యుదయము నకై కృషిచేసిరి. ఆ కృషియే పంతులుగారిని శాశ్వతులుగా నొనర్చినది.

వీరేశలింగము పంతులుగారు 1848 వ సంవత్సరమున జన్మించిరి. నాటికి ఐరోపాఖండపు నాగరికత, శాస్త్రవిజ్ఞానము, హిందూదేశమును ప్రభావిత మొనర్చుచుండెను. మత సాంఘికార్థిక రాజకీయ రంగములలో పాశ్చాత్య ప్రభావము, హిందూదేశమున కుదురుకొనుచుండెను.

రాజారామమోహనరాయలవారి వంటి మహనీయులు, సంఘసంస్కరణము నకై తగినంత కృషిగావించి, నాటికే సాంఘిక దురన్యాయము లనేకిముల చక్క బరచిరి. సతీసహగమనము, నరబలులు, గంగ జాతరలు మొదలగు దురాచారము లను నశింపచేయుటకై రామమోహనరాయలవారు తమ జీవితమును ధారపోసిరి. వార్తాపత్రికలను స్థాపించుటయు, శాస్త్రీయ విజ్ఞానమును ప్రభావముచేసియు రాయల వారు మహత్తరమైన ఫలితములను సాధించిరి.

వీరేశలింగము పంతులుగారి సంఘ సంస్కరణకై కృషికి రామమోహన రాయలవారి పూతచారిత్రమే ఒజ్జబంతి యైనది. వంగదేశమున సరళ సుందరమైన వచనమునకు శ్రీకారమును చుట్టినవారు రామరామోహన రాయలవారు. తెలుగు దేశ మున వీరేశలింగము పంతులుగారు గణితశాస్త్రము, భూగోళము మొదలగు శాస్త్రగ్రంథ ములను, వంగభాషయందు వెలయింపజేసిన ప్రథములు. రామమోహన రాయలవారు వీరేశలింగము పంతులుగారును, ప్రజలలోని అంధవిశ్వాసములు నశించుటకు శాస్త్రీయ గ్రంథము లత్యంతోపకారులుగా నుండునని గ్రహించి వానికి ప్రాచుర్యమున కలిగించి యున్నారు. సతీసహగమనమును రామమోహన రాయలవారు రూపు మాపిరన్న కీర్తిని పొందగా, వీరేశలింగము పంతులుగారు స్త్రీ పునర్వివాహకర్తగా తెలుగుదేశమున కీర్తిని పొందిరి. ఈవిధముగా నీమహనీయుల జీవితము లందు సామ్యాంశ నిరూప ణము సేయవచ్చును.

రామమోహన రాయలవారు ఆంగ్లేయ నాగరికతా ప్రభావమున సంఘ సంస్క రణమునకు పూనికొనినట్లే, వీరేశలింగం పంతులుగారుకూడ. ఆంగ్లసంస్కృతీ ప్రేరితులై, సంఘ సంస్కారమును సాధించిరి. పంతులుగారి ఊహలు ఆదర్శములు సమున్మిషము లగుచున్న కాలమునకే ఈశ్వరచంద్రవిద్యాసాగరులు, మొదలగు మహ నీయులు కొందరు, వితంతూద్వాహ విషయముకముగా వంగదేశమున కొంతఫలిత మును సాధించియున్నారు. ప్రపంచమున, రాజకీయ సంబంధములుగా, సంఘ సంస్కారైక విషయకముగా సాంస్కృతి పునరుజ్జీవన ప్రేరకములుగా అనేక దేశ ములయందు అనేక విప్లవములు అనేక యుద్ధములు కలిగినవి. అట్టి యుద్ధములందు పోరాడి సత్ఫలితములను సాధించిన ఏ వీరునికి వీరేశలింగం తీసిపోడు. వీరేశలింగం పంతులు సంఘమును శాసించుచున్న దుష్టశక్తులతో తీవ్రముగా పోరి జయించిన సంఘటన లనేకములు వారి స్వీయచరిత్రనుండియే గ్రహింపనగును. మహోన్నతుడైన మానవతావాది కనుకనే పంతులుగారట్టి యుద్ధములందు కలమును ఖడ్గముగా, సత్య

మును కవచముగా చేసికొని మేరువువలె నిలిచిరి. నాటిదనుక పుస్తకములందు నిద్రించుచున్న నీతిని మానవ హృదయములందు నిద్రించుచున్న నీతిని మానవ హృదయములందు ప్రతిష్ఠాపింపవలయునన్న ప్రయత్నము వారి మనోవాక్కాయ కర్మము లందు. మనము కాంచగలము. పంతులుగారి దొడ్డకీర్తికి విషయభూతము వారి త్రికరణ శుద్ధి, అర్జవము, పంతులుగారు తాము సత్యమని నమ్మిన విషయమున ప్రవచించుటకు గాని, ఆ మార్గమున నడిచి చూపుటకు కాని, ఎన్నడును వెనుకంజ వేయలేదు. బ్రహ్మ మతములు స్వీకరించుటకుగాని, వితంతూద్వాహములు కర్తవ్యములని ప్రబోధించి ఆచ రించి చూపుటయందు కాని పంతులుగారు స్థిరముగా నిలిచిరి. తడబాటు వారి జీవితము ననే లేదు. కష్టనష్టములగూర్చి కలగుండువడలేదు. తనవారు కాదన్నను తలకలేదు, ఒంటరిగా నిలిచి సత్య శివ సుందరములగు ఆదర్శములకొరకు పంతులుగారు శ్రమిం చిరి. కనుకనే ఆధునికాంధ్రదేశమున పంతులుగారు యుగకర్తగా కీర్తింపబడుట సంభవించినది. ఆధునికాంధ్రదేశ మఖండగోదావరికాగా, వీరేశలింగం పంతులు, నాసికా త్రయంబకముతో నుపమింపదగునని చెప్పుట వారికీర్తికి నివాళు లెత్తుట పంతులుగారు సాధించి ప్రసాదించిన యనేక ఫలితములను నేడు మన మనుభవించు చున్నాము. పంతులుగారివంటి మహాపురుషుడు నాడు జన్మించి సంఘసంస్కరణ కృషిని కొనసాగింపకయుండినచో నేటి ఆంధ్రదేశపు రూపురేఖలు వేరు వేరుగ నుండెడివని నిస్సంశయముగా చెప్పవచ్చును. నిద్రించుచున్న ఒక జాతిని పంతులు గారు మేలుకొలిపిరి పంతులుగారు పోనుగువడియున్న ఒక జాతిని చైతన్యవంతము నొనర్చిరి. తలయొగ్గుటయే తలవంచుటయే, తప్ప ఇతర మెరుగని తనజాతి జనులకు తలయెత్తుట తలనిలుపుట, తప్పునే యెదిర్చి ప్రశ్నించుట పంతులుగారు నేర్పిరి. జను లందరకును స్వేచ్ఛ స్వాతంత్రియము, సమానత్వములను ప్రబోధించిన మహాపురుషు లలో తెలుగుదేశమునకు సంబంధించినంతమటుకు వీరేశలింగము పంతులుగారు ఆద్యులు. అగ్రగణ్యులు.

పంతులుగారి సంఘ సంస్కరణోద్యమము, కాలాద్యవచ్ఛిన్నముగా నిలుచునది కాదనియు వారు ప్రాటీన సంప్రదాయానభిజ్ఞులనియు, వారు సాధించిన ఫలితములు, సార్వకాలికముగా సారంజనసీయముగా నిలబడునవి కావనియు, పంతులుగారిని నాడును నేడును కొందరు విమర్శించకపోలేదు. మేధావులైన మహాపురుషులు కొందరు దేశకాలపాత్రములను మననుసందుంచుకునియే, సాంఘిక వ్యవస్థను పునిర్నిర్మాణము చేయుట అనూచానముగా వచ్చుచున్నది. అట్టి మేధావులలో పంతులుగారొకరు.

పంతులుగారు సాధించిన సత్ఫలితములను వారి సంఘసంస్కరణ కృషిని సాహితీ వేతృత్వమును అవలకు నెట్టివేసి చూచినను, పంతులుగారియందు ధగద్ధగాయమానముగా ప్రకాశించుచున్న మేలిగుణము లనేకములను మనము గాంచగలము. అట్టిగుణముల సమాహారరూపమే ఆయన వ్యక్తిత్వము. దళితులయెడ దీనులయెడ అసహాయులయెడ, వారు చూపెన దయాదాక్షిణ్యములు, తన జాతి జనుల అభ్యుదయమునకై, తనజీవిత కాలమంతయు, వారొనర్చిన నిర్విరామమగు కృషి, వారు స్థాపించిన హితకారిణీ పాఠశాలలు, పతితయువతీ సంరక్షణశాలలు, అగతిక శిశు సంరక్షణాలయములు. ప్రార్థనామందిరములు, పురమందిరములు, మొదలగు మహాసంస్థలవలన తెలియనగును,

> "తన దేహము, తనగేహము,
> తనకాలము, తనధనము, తనవిద్యజగ
> జ్జనులకు వినియోగించిన
> ఘనుడీ వీరేశలింగ కవిజనులారా!

యని చిలకమర్తి వారి ప్రశంస పంతులుగారి యెడ సార్థకము తమజీవితము నంతను లోకోపకారార్థమే వినియోగించిన త్యాగశీలురలో పంతులుగారొకరు. పంతులు గారు గొప్ప సంఘసంస్కర్తయా ? లేక సాహితీవేత్తయా ? యను మీమాంస కొందరిని బాధించి యుండకపోలేదు. పంతులుగారి దొడ్డకీర్తికి హేతుభూతమైనది. వారి సంఘసంస్కరణ తత్పరత్వము, దానియందువారు సాధించిన ఘనవిజయములు,కాని వారి సాహితీవేతృత్వము ప్రధానమైనది. కాదను నభిప్రాయము కూడ కొంత వ్యాప్తి యందున్నది. పంతులుగారు గొప్పసంస్కర్తగానే శాశ్వతులుగానుందురు కాని, సాహితీవేత్తగా వీరిస్థానము తత్కాల ప్రయోజనమును సిద్ధించిన వెనుక నశించి పోయినదని, యీ వాదనలోని సారాంశము. కాని పంతులుగారి జీవితమును సమగ్ర ముగా బరిశీలించి చూచినప్పుడు ఇట్టి శుష్కవాదములకు తావుండదు. పంతులుగారి జీవితమునందు సాహిత్యమునకును సంఘ సంస్కరణమునకును, ఒకదానిని విడిచి మరియొకదానికి సత్యములేదు. స్థితిలేదు. ప్రాచుర్యము లేదు. సాహిత్య ప్రయోజ నము, సంఘ సంస్కరణ తత్పరత్వము సమపాళ్ళలో సమ్మేళనము పొంది విశిష్ట వ్యక్తిత్వము పంతులుగారిది. దేహ ప్రాణముల కెట్టి పరస్పరాలంబనము కలదో, పంతులుగారి వ్యక్తిత్వమున, పంతులుగారి కీర్తి ప్రతిష్ఠలందు సాహిత్యవేత్తగా మహ నీయుడైన సంఘ సంస్కర్తగా ఆ మహాగుణములకట్టి పరస్పరాశ్రయము కలదు, తెలుగు సాహిత్యమునందు పంతులుగారివంటి ఉపదేశకు లింకొకరు కన్పింపరు,

పంతులుగారు పుణ్యపురుషులు ప్రవక్త. మతాచార్యుడు. బౌద్ధసాహిత్యమును, సంఘ సంస్కరణోపకరముగా గ్రహించినవారిలో తెలుగుదేశమునందు పంతులుగారికి అజరామరమగు స్థానము గలదు. వజ్రాభములగు తమ రచనలచే తెలుగు దేశమునందలి సాంఘిక దురాచారములను నిర్మించి, నూతన యుగారంభమును గావించిరి. "శివేతి రక్షయే" యను ఆదర్శమును తమ సర్వ సాహిత్య సృష్టియందును, పంతులుగారు ప్రబోధవాఙ్మయనిర్మాత ఇట్టి వాఙ్మయ సృష్టియందువారు ఆద్యులగుటయేకాక అగ్రగణ్యులై గూడనై యున్నారు. పంతులుగారు సాహిత్యసృష్టికి గడంగుటతోడనే కళ కళకోసమను నాదర్శము ప్రాచుర్యమును పోగొట్టుకొనినది. కళ లోకారాధనమునకై యుపయోగింపబడవలెనని, కావ్య పరమార్థము విశ్వశ్రేయమనియు పంతులుగారు నిర్వచించి నిరూపించినారు. పంతులుగారు సాహిత్య సృష్టికి గడంగినప్పటికి, తెలుగు దేశము నలుమూలల నావరించి యుండిన అంధతామిశ్రములు తొలగినవి. తెలుగువారికి విజ్ఞానజ్యోతికి, శాస్త్రదీపమును పంతులుగారు ప్రసాదించిరి. పంతులుగారు వినిర్మించిన సాహిత్యమువలన సామాన్యుడు మాన్యుడాయెను, సాహిత్యమునకు నూత్న ప్రయోజనము సిద్ధించెను.

చిన్నయసూరి వచన రచనము వియద్గంగా సమానమై విహరించుచుండగా, పంతులుగారా వచన రచనమును, జగతికి మిన్నేరు డిగినయట్లు, ఆకర్షింపజేసి సరళము సర్వజన సులభగ్రాహ్యముగా నొనర్చిరి. పంతులుగారు స్పృశింపని సాహిత్యప్రక్రియ లేదు. నాటకములు, నవలలు, ప్రహసనములు, ఉపన్యాసములు, వ్యాసములు, సాహిత్య విమర్శ, చివరకు వాచక పుస్తకములగూడ పంతులుగారు వెలయించియున్నారు. ప్రాచీన తాళపత్రగ్రంథముల ననేకముల సుపరిష్కృతములుగావించి, ప్రకటించి తెలుగుభాషకు మహోపకారము గావించియున్నారు. ఆంగ్ల సారస్వతరీతులను పరిశీలించి తెలుగు సాహిత్యమునందు ప్రక్రియా వైవిధ్యమును తెచ్చిపెట్టినది పంతులుగారే, ఈ మహానుభావుడు కృషిచేయని సాహితీక్షేత్రములేదు. పండింపని పంటలేదు. అర్వాచీను లందరికి నతడొసగినది యాదిభిక్ష. నవలలు, ప్రహసనములు, కథలు, సారస్వత విమర్శ, దేశచరిత్ర, జీవితచరిత్ర, కవుల చరిత్రము లనెడు వృక్షతతిలో నేడు ఫల పుష్పభరితమగు, శాఖోపశాఖలతో విస్తరించియున్న యీ సాహిత్యారామమున పంతులుగారు నాడు చేసినకృషి, గావించిన యపూర్వదోహదరచనము, అపూర్వములు పంతులుగారికి పూర్వమే ఆ యా ప్రక్రియలందు కృషిచేసి, కొంత ఫలితమును సాధించిన మహనీయులు కొందరున్నను, ఆ యా ప్రక్రియలకు సాహిత్యగౌరవమును

స్థితిని ప్రాచుర్యమును కల్పించినది. పంతులుగారే యగుటవలనను, అర్వాచీనులందరును, పంతులుగారినే మార్గోపదేష్టగా స్వీకరించుట వలనను, ఆ యా ప్రక్రియలను తెలుగున సాధించినవారిలో పంతులుగారు ఆద్యులుగా కీర్తింపబడుచున్నారు. పంతులుగారికి పూర్వమే శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారు, శ్రీ కొక్కొండ వెంకటరత్నము పంతులువారు, శ్రీమాన్ పరవస్తు వెంకట రంగాచార్లయ్యవారులుంగారు, మొదలగువారు, స్వతంత్రరూపక నిర్మితికి, సంస్కృతనాటకానువాదమునకు పూనుకునియుండిరి. శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు ఆంగ్లరూపకముల ననువదించుటకు ప్రధాన్యము వహించియుండిరి. శ్రీ నరహరి గోపాలకృష్ణమశెట్టిగారు రంగరాజచరిత్రమును వచన ప్రబంధమును సంతరించియుండిరి. 1872 వ సంవత్సరప్రాంతముననే మచిలీబందరునుండి వెలువడుచుండిన పురుషార్థప్రదాయిని యను పత్రికయందు శరీర శాస్త్రము, జ్యోతిశ్శాస్త్ర విషయములు ప్రచురింపబడుచుండెను. 18 5 వ సంవత్సర ప్రాంతము విశాఖపట్టణమునుండి వెలువడుచుండిన సకల విద్యాభివర్ధని యను పత్రికయందు, కవుల చరిత్రమునకు సంబంధించిన విషయములు ప్రచురింపబడుచుండెను. వీరేశలింగము పంతులుగారికి పూర్వమే శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు వెలయించుటకు పూర్వమే వెలువడియుండెను. పంతులుగారు 1874 వ సంవత్సరమున అక్టోబరు నెలయందు వివేకవర్ధని యను మాసపత్రికను స్థాపించిరి. ఈ పత్రికకు పూర్వమే 'పురుషార్థప్రదాయిని' 'ఆంధ్రభాషాసంజీవని' 'లోకరంజని' మొ॥ పత్రికలు వెలువడియుండెను, అయినను, పంతులుగారు యుగకర్తగా కీర్తింపబడుటకు హేతువును మనము పరిశీలింపవలసియున్నది. పంతులుగారు చేపట్టిన వివిధసాహిత్య ప్రక్రియలకు, స్థితిని ప్రాచుర్యమును, చేకూర్చుటయే దానికి హేతువు. వివేకవర్ధని సాధించిన ఘనవిజయములను పూర్వోక్తములగు పత్రిక లేవియు సాధింపలేదు. పంతులుగారి వ్యాసములు, ఉపన్యాసములు, ప్రహసనములు, నాటకములు, ప్రజలకు చేరువగుటవలన, వారు యుగకర్తగా కీర్తింపబడుట సంభవించినది. పంతులుగారి 'వ్యవహారధర్మబోధిని, బ్రాహ్మవివాహము శాకుంతలానువాదము, ప్రహసనములు, నాడు తెలుగుదేశమును మిక్కిలి ప్రభావితములుగా నొనర్చినవి. పంతులుగారు స్త్రీ జనోద్ధారకుడు. స్త్రీ విద్యావ్యాప్తికి పంతులుగారు సలిపిన కృషియపారము. వారికై, 'సతీహితబోధిని' యను పత్రికను పంతులుగారు నిర్వహించి, దేహారోగ్య 'ధర్మబోధిని' 'పత్నీహితసూచని', మొదలగు శాస్త్రీయ గ్రంథములను ప్రకటించిరి. వితంతువుల దుస్థితిని చాపుటకై పంతులుగానొర్చిన కృషి లోకవితతము. స్త్రీ పునర్వివాహ

దుర్వాద నిర్వాపణములకు గాని 'ఆర్యమతబోధిని' అట్టహాసములకుగాని పంతులుగారు తమపూనికను విడువలేదు.

ఆంగ్ల వాఙ్మయ ప్రపంచమున లబ్ధప్రతిష్ఠులైన మహాకవీశ్వరుల నాటకములను. పద్యకావ్యములను ప్రహసనములను, పంతులుగారు పెక్కింటి ననువదించియున్నారు, సంస్కృతభాషార్ణవమునుండి రత్నములను బోలిన 'రత్నావళి' 'మాళవికాగ్నిమిత్రము' ప్రబోధచంద్రోదయమును తెలుగు సరస్వతికి కాన్కపెట్టినరు. రాజశేఖరచరిత్రము, సత్యరాజా పూర్వదేశయాత్రలను, కమనీయములగు నవలలను రచించినారు, రాజశేఖరచరిత్రము 'ది వికార్ ఆఫ్ వేకఫీల్డు' అను గ్రంథమునకనువాద మని కొందరు విమర్శకులు తలంచుట పొరపాటు. దేహబంధమునందు, వీనిరెంటికి సాదృశ్యములు కలవు. ఒకింతసాహాయ్యమును తాము బొందితమని పంతులుగారే వ్రాసియున్నారు. కానినూటికినూరుపాళ్ళు తెలుగు నవల రాజశేఖర చరిత్రము చిలకమర్తి వంటి నవలా రచయితలకు మార్గదర్శకమైనది. పంతులుగారు రచించిన సత్యవతీ చరిత్రము, తెలుగు సాంఘిక నవలలో తొట్టతొలుతటిది. పంతులుగారు 'ప్రహ్లాద' 'దక్షిణగోగ్రహణము' 'సత్యహరిశ్చంద్రనాటకము' మొదలగు స్వతంత్ర నాటకములనుగూడ రచించియున్నారు, శరీర శాస్త్ర సంగ్రహము, జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము, జంతుస్వభావచరిత్రము, మొ॥ శాస్త్రీయగ్రంథములను వెలయించి యున్నారు, 'వివేకవర్ధని', 'సతీహితబోధిని', 'బ్రతసంవర్ధని' 'తెలుగుజనానా' జవం త్రికలకు సంపాదకత్వము వహించియున్నారు. వివేకవర్ధిని సాధించిన ఘన విజయము లనుగూర్చి ప్రసంగింపవలయునన్నచో పుటలకు పుటలు నిండవలసియుండును. వారి గ్రంథకర్తృత్వమునుగూర్చి చెప్పవలనన్నచో పందొమ్మిదవశతాబ్ది సాహిత్యచరిత్రము లిఖింపవలసియుండును. వారిసంపూర్ణవ్యక్తిత్వమును సమాలోచనము చేయవలయు నన్నచో బహుయోజన శాఖాసంయుతమైన వటవృక్షమును మనము నిలుపవలసి యుండును. ఆ వటవృక్షము ప్రసాదించు చల్లదనమును, దృశ్యమానమొనర్చు రామణీయకతను అనుభవించి అభినందింపవలయునేకాని దాని కాండ విస్తీర్ణతను, శాఖల పరిమితిని నిర్ణయించుట అనవసరముకదా !

